# కాంతామతి

ఇది

సత్యహరిశ్చంద్ర, మనోరమ, అరేబీదేశపుకథలు మొదలైనవి వ్రాసిన

బ్రహ్మశ్రీ చెలికుపల్లి వేంకటరామయ్యచే

రచియింపఁబడి

పబ్లిషర్

కాళహస్తి తమ్మారావుగారి కుమారుఁడైన

సూర్యప్రకాశరావు,

అంబికా బుక్కు డిపో

రాజమహేంద్రవరము

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము,

నిడమర్తి వెంకటకృష్ణమూర్తి అండు బ్రదరువారిచే,

శ్రీ కృష్ణాముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడినది.

1925.

 [వెల 0—12—0.

## ఈ నాటకమునందువచ్చు పా[త్రలు]

సూత్రధారుఁడు.
విక్రమార్కుఁడు—ఉజ్జయినీదేశపురాజు.
మంత్రి.
శక్తివర్మ—కాంతామతి తండ్రి.
వేగవంతుఁడు— } కాంతామతియున్న చెఱసాల
గుణవంతుఁడు— } కావలివారు.
కిరాతులు—వ్యాఘ్రపాలురు వ  రాలు.

స్త్రీలు.

కాంతామతి—విక్రమార్కుని భార్య.
మదనమాలిని—దాసి.

## భూమిక.

ఇప్పుడు సహజముగా స్త్రీవేషధారులు తక్కువయగుటచే స్త్రీపాత్రలు ఎక్కువగానున్న నాటకముల బ్రదర్శించుట కష్టముగానున్నదనియు స్త్రీపాత్రల తక్కువగాగల నాటకమొకటి రచింపుమని కొందఱు మిత్రులు నాతో చెప్పియుండిరి. ఆకారణమున "కాంతామతి" నాటకమును రచించితిని.

ఇది చాలకాలము క్రిందట రచింపఁబడియు ప్రచురింపఁబడు భాగ్యము లభించినది కాదు. నేను కా. హాస్పి సూర్యప్రకాశరావుగారు దీనిని ప్రకటించెదమనియు, గ్రంథస్వాతంత్ర్యము తమకొసంగుమని కోరినందున వారి యభీష్టము నెరవేర్పు నుద్దేశముతో ప్రకటనాధికారమొసంగితిని. ఇంక సిద్ధనాటకముల వ్రాసియు ప్రోత్సాహమొసంగెదరుగాక. ఇందు కొన్ని తప్పులుండవచ్చును. వానిని దయతో దెల్పిన రెండవకూర్పులో సవరించుకొనదలచి పండితులకు మనవిచేయుచున్నాను.

ఇట్లు విద్వద్విధేయుఁడు,
చెఱుకుపల్లి వేంకటరామయ్య.

శుభమస్తు.

# కాంతామతి



## ప్రథమాంకము.



### నాంది

ఉ. తన్నవమానమున్ బరపె తాళిదునే యనుచుం గోపసం
పన్నమనస్కయై హరిఁబాసి యరణ్యమునందు గోర్కెమై
వెన్నుని పెన్నురంబునను వేడ్కఁ జెలంగ వసించి లక్ష్మి దా
గ్రన్నన నాథుఁ గౌఁగిలిసి కావుత సభ్యుల క్షేమ సంపదన్.

నాంద్యంతమున సూత్రధారుఁడు

సూ—సంగ్రామానుకూలమతివిశేషనిరతిశయులగు నో సభాస్తారులారా! సూర్యసమతేజోధుర్యులారా! చంద్రకిరణతిరస్కృతామలయశోవిరాజితదిగంతరాళులారా! అంగారకసదృశశౌచిత్వలలితులారా! బుద్ధిజితబుధులారా! గురుమతిగురులారా! శుక్రనీతివిశారదులారా! ‘‘ఈవసంతసమయంబున నేదేని మనోహరనాటకమాడి మమ్ము సంతోషపెట్టుడని కదా నుడివితిరి. అట్టినాటకరాజమేదికలదో బహుళనాటకపరిశీలితాంతఃకరణురాలును సమయస్ఫూర్తికలదియు నగు మదీయ ప్రేయసితో నాలోచించెదను.

నటి—(ప్రవేశించి, నాథా! మన్నింపుము; జనులొక విషయమునుగూర్చి తబ్బిబ్బులగుచుంటచే నదేమియో విచారించి వచ్చుటచే నింత యాలస్యమైనది.

సూ—ఎందుకట్లు ప్రజ తబ్బిబ్బు లగుట.

న—వెనుక తిరుమలేశ్వరుని భార్య మగనితోఁ బట్టుబట్టి వెడలిపోయినది కదా?

సూ—ఔను. నే నెఱింగిన యంశమే.

న—ఇప్పుడు చక్కని కుమారుని వెంటఁ బెట్టుకొని వచ్చినది.

సూ—అయిన

న—ఎంత సిగ్గుమాలిన యాఁడుదియో కాని వీఁడు నీ కుమారుఁడని మగనితో వాదించుచున్నదట.

సూ—తర్వాత.

న—అందఱుఁ జేరి వారిని సఖ్య బంధించి యద్దానిని గూర్చి చెప్పుకొనుచున్నారు. ఆసంగతి వినుచు మాటచే నింత ప్రొద్దు పోయినది

సూ—(స్మృతి నభినయించుచు) సఖీ! అనవసరపు వ్యవహారము మాటాడుచు ప్రస్తుతాంశమును మఱచితిమి.

న—నాథా! కర్తవ్య మేమి;

సూ—"ప్రియసఖి నవీన నాటకమాడి మము సంతోష పెట్టు" మని ఆజ్ఞ నాటక మేది కలదు?

న—నే నుడివిన యంశములే కల యొక నాటకమును మొన్న నే చూచియుంటిని. దానిని ప్రదర్శించిన బాగుండును.

సూ—ప్రియసఖీ! దానిని రచించిన వా రెవరు?

న—నాథా! వినుము.

సీ. బాలకులకు నీతి బాగుగా బోధింప
బాలనీతిసువార్ధి వరలినాఁడు
సరసులు మెచ్చఁగఁ జతురత ద్రౌపదీ
వస్త్రాపహరణంబు వ్రాసినాఁడు
పండితపామరుల్ పరమహర్షమునొంద
ఇంద్రవిజయము రచించినాఁడు
గానవ్యాసంగంబులు కడునేర్పుమెఱయ "గాం
తామతి" నాఁ గూర్చి తనరినాఁడు

గీ. శౌనకసగోత్రభవుఁడు ప్రక్షాలితుఁడు
చెఱుకుపల్లి వారిజలధి శ్రీయనుజుఁడు,
విమల కృష్ణయార్యసుతుఁడు కీర్తికీర్తి
యరయ వేంకటరామాఖ్య నలరువాఁడు.

సూ—తరుణీ! ఈతని గ్రంథరచన కడుహృద్యంబని వింటిని. నేఁడు కని యానందించెదను. కాని, సఖి! నీమాటలనమ్మి యీ నరసాగ్రిసరులకడ బ్రదర్శించి నగుబాట్ల నొందెదనేమో యని భయమగుచున్నది.

న—ఆర్యా!

గీ. నవ్వఁబనిలేని జాలిని నివ్వటిలెడు
పట్ల నవ్వకుండరుబోయ భాషణములు
మఱియు నయ్యెడలజూడ మనసునందు
బుట్టి రసముల కేరీతి బొడలువారొ.

సూ—సఖి! యిప్పటికె చాలయాలస్యమొనర్చితిమి. వసంతాగమానందసంభరిత పరభృతారావ వినోదకాంక్షితంబును, భృంగాంగనాకృత ఝంకారబంధురంబును, శుకశారికాకూజిత కుతూహలంబును, శృంగారరసస్థాయియు నగు నీ వసంతంబును నీ మతివిశేషంబున వర్ణింపుము.

న—చిత్తము.

సీ. పికసంపతికిఫల ప్రకరంబుదనియించి
చూపముల్ దాతృత్వ భగాంచ
మధులిహంబులకు సమ్మతిమకరందము
నిచ్చిలతాంపముల్ హెచ్చుగాంచ
మలయవాయువు పరిమళయుతమై పాంథ
జనులకు మదమిచ్చివినుతిగాంచ

వట్టుమ్రోడులుఁపల్లవ స్ఫూర్తిగనులకుఁ
బంధువొసంగుచుఁ బోధవిల్ల

గీ. చంద్రికరణంబులెంతయుఁ జలువవీయ
రమణబాహులతావిహార కలితలయి
బాలలెంతయు నాహ్లాదభరము జెంది
యూవసంతితా సరముల నింపుగాంత్రు.

[తెఱలో]

అట్టి సంతోషమునకే నర్హురాలనా?

సూ—(విని) సుందరీ! నీ గానమాధుర్యము వర్ణనాతీతము. మనగానకళాభిధాన తన నామము సార్థకముగఁ గాంతామతియై నిలిచి నాధునిరాకకై యెదురుచూచుచున్నది. కావున మనము తడయజనదు

న—చిత్తము. [ఇరువురు నిష్క్రమింతురు.]

ఇది ప్రస్తావన.



# కాంతామతి.



## ప్రథమాంకము.



రంగము—ఉద్యానవనము.

కాంతా—(ప్రవేశించి)

చిత్రపదవృత్తము—సారసలోచనశౌరీ!
గోరెద నిన్నుదభక్తిన్
నారిమణిం ననుగూర్మిన్
శ్రీరమణా! తెగ గావన్.

ఆహా! నేటికి నయిదుదినంబులయ్యె వివాహమయ్యి మదీయ ప్రాణనాథుని దర్శించు భాగ్యమలవడినదికాదు. ఈ రోజున "శయనాగారంబున కరుదెంతు" మని వర్తమానమంపుటచే నిందువచ్చి "చంద్రోదయమునకు నిరీక్షించుచాతక" మట్లుంటిని. ఆమహానుభావుడు దయచేయునని యెదురుచూచుచుంటచేc గన్నులు కాయలుకాచినవి. మద్విభుని దివ్యనామ సంస్మరణమాత్రమున శరీరమున బులకలుద్భవించుచున్నవి. నా నాథుcడు దయచేసినచో

ఉ. ముచ్చటదీరcజూతుకద మోహనమూర్తిని బాహువల్లరిన్
హెచ్చుతమింగవుంగిట వహించి సుఖింతునసంగ కేళిలో
విచ్చుమనంబుతో నధరబింబమునందలి పంటినొక్కుతో
గుచ్చినగోటిపోటు లనుకూలతc జెందెద గబ్బిగుబ్బతోన్.

(ఇటునటు పరికించి) చెలికత్తెలెవ్వరిట లేరుకదా? వినిన హేళనమొనరింపఁ చూచెదరు. నా ప్రాణవిభుఁడు వచ్చుజాడ కనఁబడదే. మన్మనోవల్లభా! నిముషమొక యుగంబుగ గడపు నీచెలి బ్రోవ వేగరమ్మా. కాలాతిక్రమణమ్మైన విరహాదేశికపి భిన్నమనస్కనై యచేతనక్రియను నున్న భవదీయ జాయం గాంచి జాలిం గూరెదవు.

(మలయవాయువుసోకి పులకలుగ్రమ్ముటచూచి) అబ్బా! యేమిది? పడగాడ్పు కొట్టుచున్నయది. (పరికించి) కాదు. కాదు.

గీ. మలయగిరిమార్గమందు బయలు వెడలుచు
కమలసంతతుల పరిమళములనొరసి
సాంద్రశీతలవారిపూర సరసిఁజేరు
మందమారుత మిదినాకు మారకంబు.

అబ్బబ్బా! ఈవడగొట్టునకే జెదరుచుండ "గోరుచుట్టుపయి రోకలిపో" టనునట్లు లీచందమామకూడ జేరి బాధించుచున్నాఁడేమి సేతును?

ఉ. రూపముజె దనాఁడు నను బ్రోచెదఁజేసి కొలంబు సామిచే
దాపము పెట్టుచుంటివిక దా మగనాండ్రను నిర్దయాత్మతన్
బాపమటంచు నెంచవు స్వభావము క్రూరము పాముఁద్రింగ సం
తాపము జెందవే పరుల తాపములట్టివటం చెఱుంగవే

నీవు మిన్నంటుట నా మనోహరుఁడు వచ్చునంతవఱకే కానిమ్ము. ఓ పాడుపికమా! నీకుఁగూడ సమయమిపుడే యలవడినదా? కూయుము. కూయుము.

గీ. ఒగరు లెగటూఁగలిగిన చిగురులదిని
తుల్లిపడెదవు నీకెంత తుచ్ఛమతివి
నాథుకథగామృతాస్వాదనసుఖమేను
గొనఁగ "జూచికన్నుల నిప్పగొనవె పికమ!"

ఓగండుతుమ్మెదా! వైరులతోఁగలసి నీవుకూడ దుష్టత్వమూనుచుంటివా? ఎట్టిమంచివారికైన దుర్జనసాంగత్యము చెట్టతనము కలిగింపక మానదు. అయ్యయో! ఈపాడుచిలుక కేమిదుర్బుద్ధియో కాని శ్రుతికటువుగ బలుకుచున్నయది. ఓప్రాణప్రియా! త్వరగ రాకున్నచో నీ దుష్టశత్రుమధ్యంబున నసదనై చావవలసివచ్చును. ఈరాకాసిమూకల నీఁడించి యబలను గావలేవా? రమ్ము. రమ్ము.

విక్రమార్కుడు—(ప్రవేశించి పరిక్రమించుచు) నేననుకొనినంతెఁ జనితిని. దీని గడుసుతనమేమో కొంతవరకు వినోదార్థముగా బరీక్షించి పద్మలకాంతాగారమందుంచెదను. (అని సమీపించును.)

కాంతా—మనోహరా! వందనము. రాజకార్యనిర్వహణాయాస విశ్రాంతిస్వాంతులగు భూకాంతుల కంతుల మనోజ్ఞహాసభాషణ వినోదములేకదా ప్రమోదజనకంబులు.

విక్ర—(తనలో) అప్పుడే తనబుద్ధివిశేష ముపయోగించుచున్నది. (ప్రకాశముగా) తరుణీ! నీవుచెప్పునది యదార్థమే కాని,

కాంతా—(తనలో) "కాని" అని యాఁగుటకు కారణమేమియో? (ప్రకాశముగా) ఇంతకన్న నొక్కటెద్దికలదు?

విక్ర—(తనలో) తనతోఁగూడియుండుటకన్న యన్యములేదని యెట్లుసూచించుచున్నదో? (ప్రకాశముగా) లేకపోవచ్చును.

కాంతా—(తనలో) ఇంతలి కంఠస్వరమున కర్థమేమిచెపుమా (ప్రకాశముగా) మనోవల్లభా!

గీ. మంత్రి కార్యనిర్వహణము మంత్రివలెను;
భుక్తిమాతరీతి, శయనమునను వేశ్య,
తెలుఁగు, రూపమునను రంభ తీరుపనుల
దాసిపోల్కె, క్షమకు ధాత్రి, యాసతీసతి.

విక్ర—అట్టివారు లేరని తలంచెదను.

కాంతా—లేకేమి? పెక్కురుకలరు.

సీ. పరమపతివ్రతా ప్రతిభచేతనెకదా
మృతభర్తృజీవనం బతివనిల్పె
పరమపతివ్రతా ప్రతిభచేతనెకదా
రవిరాకకష్టంబు రమణినిల్పె
పరమపతివ్రతా ప్రతిభచేతనెకదా
సభలోనభంగంబు సతికిదప్పె
పరమపతివ్రతా ప్రతిభచేతనెకదా
ముమ్మూర్తులనుగనె పుత్త్రులుగను

గీ. అట్టి లోకపావనులుండంగ నవనినాథ!
యేలకాదితలదూషింతు విద్ధగులు
పెక్కులున్నారునమ్ముడీ నిక్కమనుగ
నందుతమదాసికూడ నొకంతయగును.

ఆత్మస్తుతి దోషావహమైనను సమయమువచ్చినప్పుడు చెప్పకొనక తప్ప ని సరియగుటచే నిప్పుడు వక్కాణించితిని.

విక్ర—(తనలో) యేమీ? దీనిగర్వము తనకుఁదానె పతివ్రి తనని పొగడుకొనుచున్నది. ఇట్టివారేకాబోలును పతివ్రతాశిరోమ ణులు "సాహసం మన్మథాంచైవ" యనునట్లు స్త్రీలకెంతయేని తెగువ కలదు. (ప్రకాశముగా)

క. కులకాంతయిట్టులాడునె|వెలవెలదు కలందుగాక వినుమోసుదతీ!
పలుపలుకులుపలుకంగా|వలదికనీమహిమజూప బాల్పనటొప్పా.

అంతవరకే గృహంబుననే నిన్ను బంధించితిని.

కాంతా—(తనలో) హా! పరమేశ్వరా! ఇదియేమివింత లోక

సామాన్యముగా నాడుమాటంటిని గాని నన్నుద్దేశించిపలికితినా? ఈప్ర
సంగము మార్చి మరియొక ప్రసంగములోనికి దింపెదను. (ప్రకాశ
ముగా) నాథా! ఈకప్పురపువిడెము గైకొనుము.

ఉ. కమ్మనితావులంబొదలి కస్తురిచే మిళితంబునౌచు సౌ
ఖ్యమ్ములనిచ్చుగావునను గాంతుఁడ; హస్తమునం గొనందగున్
తమ్ములమిద్దిదీనిగను తత్పరతన్ భవదీయజాయ ప్రే
మమ్మున వేఁచించి యిడెమంజుల చారుకరాంగుళంబులన్.

(అని తమలపాకులచిలకల నివ్వఁబోవును.)

విక్ర—(పుచ్చుకొనక తనలో) భళిరా! జాణయునగు యువ్వది యే
చల్లచల్లగా నీప్రస్తావన వదలి మఱియొక గాథలోనికి దింపుచున్నది.
(ప్రకాశముగా) సుందరీ! నీసాహసముజూపక వేఱుప్రసంగ మేలచేసె
వుద? నిన్ను బరిణయమగుటకూడ నీప్రభావముజూచుటకొరకే కదా?
మున్ను నీవొనర్చిన ప్రతిజ్ఞ మరచితివా యేమి?

కాంతా—(గుండెఝల్లున తనలో) అయ్యో! ఇదియేమి విప
రీతము. బాల్యచేష్టలచే నాడట్లు గావించితినని నన్నిక్రియ వంచింప
బోవుచున్నాఁడే? (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! అల్పజ్ఞత్వమున నొన
రించిన తప్పుల మన్నింపగోరెదను.

[అని నమస్కరించుచున్నది.]

విక్ర— అందినశిఖయు, పందకున్నకాళ్ళుపట్టు బహుమాయా
వాగురులబన్ను యన్నులమిన్నల నెవరు విశ్వసింతురు? ఇది యనినంత
జేయనేర్చునో లేదో చూడవలెను. (ప్రకాశముగా) ఓసి మాయలాడి!
ప్రతిజ్ఞనేఁటవేర్చుకొనుట మేలుగదా? అట్లుకానిమ్ము.

కాంతా—(తనలో) ఇది యేమిదురవస్థ. ఈమహానుభావుఁడు
దీర్ఘక్రోధమును బూనియున్నాఁడే! (ప్రకాశముగా) దేవా! నాయందు

దయయుంచి ప్రసన్నుఁడవుకమ్మా. పురుషుల స్వాతంత్ర్యములోనుండి
వారి యిష్టానుసారము మెలఁగవలెఁగాక నే నేమి చేయఁగలను?

గీ. బాల్యమందు దండ్రి యౌవనమునందు
భర్తయు జరను సుతులు కాపాడవలెను
గాని మానినులకు నెందుఁ బూనఁగలదె
యింకనే స్వతంత్రతంబు నెన్ని చూడ.

తమ పాదసేవకురాలగు నన్ను గరుణించి రక్షింపకున్న వేరు రక్షకు
లెవరు? రక్షింపుఁడు. రక్షింపుఁడు. (అని కాళ్ళమీఁదఁబడును.)

విప్ర—(తనలో) ఏమిది? నీతివాక్యములు. ఎదిరొ యొకతంత్ర
మున్నదని యెగనుబెట్టఁ జూచుచున్నది. (ప్రకాశముగా) కాంతా!
నీ వెంత చెప్పినను వినువాఁడను కాను. నీ సాహసము జూపువరకు
నిను విడిచి యుండ గదలనియును.

కాంతా—హా దైవమా! పెండ్లికాక భర్తలకై కొందఱును
మృతిజెంది మగలవార్త కొందఱును, సంసారమందలి లేమిచేఁ గొం
దఱును, విభుఁడు జారుఁడై తిరుగుచుండఁజూచి కొందఱును, సతతంబు
దన్ను హింసించుచుండ కొందఱును, అనుకూలుఁడు గాక కొందఱును,
పెక్కుమంది పలువిధముల గుందుచుండగా నాకు ననుకూలుని, గుణనిధిని
ఏకపత్నీవ్రతుని, సాధువర్తనుని, మహావైభవయుక్తి గూర్చియు
నేడ్పించుచుంటివా? అఘటనఘటనా సమర్థుఁడవగు నీచేత కేదియసాధ్యం
కము? (ప్రకాశముగా) మహారాజా! దీనులను బ్రోవను దుష్టులను
శిక్షింపను జాలిన మహానుభావులగు దేవరయే యొకయాఁడుదాని నన్యా
యముగ శిక్షింతుమన్న నడ్డువారెవరు? కంచెయే చేనుమేసిన కాపేమి
చేయఁగలఁడు? అనువారిబుద్ధి యల్పబుద్ధికదా? నాపైని దయయుంచి

గీ. తలఁతునెప్పుడు మీపాదజలరుహముల
చిత్తమందన్యచింతల జేర్పలేదు
కరుణననుబ్రోవదగును భూకాంత! కాంత
వంతలంబడజేయుటే సంతసంబు?.

విక్ర—నీపలుకులు గట్టిపెట్టి యన్నమాటల సాధింపుము.

కాంతా—[తనలో] "ఇదమిద్ధ" మని యేదియూ యొకటి నిర్ణయించువరకీయన వదలునట్లులేదు. ఐనను.

చ. తుదినొకసారిప్రార్థనము తోరపుభక్తిని జేసి చూచెదన్
మదిదయబుట్టినట్టిదియు మానినదైవమె నాకు దిక్కటం
చుఁదలఁచి పూనగావలయుఁ జొప్పడుకార్యవిధానతత్వముల్
బదియొకడైన రాచసతి భావముహీనతకెందుజొచ్చునే.

మఱియు,

గీ. పుట్టినదిరాచపుట్టువు మెట్టినయది
రాజరాజగృహంబు కరంబుబట్టు
టెన్నసార్వభౌమునహహా? యిన్నిచూడ
దైన్యమొందంగనేటికి ధైర్యమెడలి.

[ప్రకాశముగా]

సుకాంతి—మనోహరా! సనుందయం। గనంగవం। దనంబిడే॥

పంక్తి—భూపతిమౌళీ! నాపయినేలా! కోపముబూనం। జూపుము కాంతిన్॥

పాలాశదళవృత్తము—

చరణసరసిజముల మసలక గొలుతుంజే
వరకరకృపఁగనఁ దగుఁ బడలిఁగడుదీనల్
పరదుఁడవగుము సదయ

మతకరిదైవమీయెడల మానవనాయక! నీ కృపాభ్యర్థి
తీర్థఖడయుంగ వేనినను శీఘ్రమద్యంపుము మాటలేటికిన్

విక్ర—ఏల యాలస్యము? నడువుము. నడువుము.

కాంతా— దేవా! రక్షింపుము. గోటితోబోవుదానికి గొడ్డళ్ళవరకు దేవలదు "ధాన్యపుగింజలో బియ్యపుగింజ" యనునట్లు ఎందుకు సామాన్యవిషయము పెంచవలదు.

గీ సతులధర్మంబు తెలియంగ శక్యమగునె
వారి చర్యబ్రహ్మకుగన వశముకాదు
మనుజమాత్రుని కేరీతి మదిని తెలియు
మానుమానుము భూవర మచ్చరంబు.

విక్ర—ఏ మాయలాడి!

ఝంఝమృత్యము—ఓ తులువా! ఏ తులువా! చేతిమునc! బ్రీతియ కో?

కాంతా—ప్రాణనాథా!

సరిగ్వణి- దేవరా! బ్రోవరా! దీననం గావరా!
సావధానాత్మతం జక్కనాలింపుమా
సేవకుల్ నేరముల్ శేసినం గావవే
బ్రోవవే యీవిధి గోటిసన్ సద్దయన్॥

విక్ర—ఓసి! జగజంత! "మొగనిగొట్టి మొగసాలకు మొట్టలుబెట్టిన" దనునట్లు ఎట్లాడుచుంటివే?

కాంతా—[కాళ్ళమీదబడి]

త్రిపద—ఓదయితా! జననాథా! వాదముసేయంగంజాల
నాదెసబ్రేముడిసేయుము! లేదో యదృష్టవిహీనకు॥

ద్విపద ఓనాథ! యోసామి! యోకృపావార్ధి
పూనితర్కింపగాం బోలు నేచెప్పుమ

విక్ర— ఓకాంతనీకింత యోపునేపంత
మీకుంబినీకాంతు నెరనెంచవేల?

కాంతా— తగునెపోసినంటి ధరణినాధులకు
మగువలతోవాదు మాటలుబలుక

విక్ర— సార్వభౌమునినైన సాధించగలరు
గర్వంబుప్రబలంబు కాంతలకెందు

కాంతా— మగువలెమగవారి మర్యాదనిలుప
దగుదురుపెదవారు తగరునిజంబు

విక్ర— మర్యాదగలనాతి మగవారితోకె
గార్వాచరణకయి కడగునేతలఁప

కాంతా— తలఁపసంసారంబు తరుణిచేఁగాగి
నిలనుబెక్కురుగూడ నేర్పునదిమె

విక్ర— గుణహీనతోగూడి కొనికాపురంబు
ఘనమనిజేయునే కామించిబుధుఁడు

కాంతా— రమణ! ధర్మాదికార్యంబులయందు
రమణిసాధనమయి రాణించుచున్న

విక్ర— పడఁతితోనుంటయే పాపంబుజగతి
విడచుటేయపవర్గ విధముతలంప

కాంతా— సుదతికాధారంబు సుందరియగును
నగుబాటురాకుండ నాతికాపాడు

విక్ర— మగువమాయలబడు మానవంతుండు
తెగువబూనితరించు తెన్నుగనుంకో

కాంతా— మానవతులనునింద మానుమోనాథ!
పూనడిమొదలక్ష్మి పురుషోత్తముండు

విక్ర— చంచలయగులక్ష్మి జక్కఁధరించి
సంచరించడెమది సరణులశౌరి॥

ఓసి గడుసుపోకలమారి! ఎన్నెన్నివింతలనేర్చితివే? యిఁక నీసాహసము గూడ గనఁబరపుము.

కాంతా—ఓపార్థివేంద్ర! దయాసాంద్ర! వైభవజితవిద్యేంద్ర!

చ. పతియొనరింపుమన్నపని పాపమెయైనను బుణ్యమైన స
మ్మతి జరిగింపగావలయు మానినికెందున నాథుసేవయే
యతిముదమిచ్చుగావున మహాత్మ భవచ్చరణాబ్జపూజ నా
కతిశయ మీయదేయనుచు నాజ్ఞశిరంబున దాల్చుధీరనై.

విక్ర—(తిరస్కారముతో) అటులనే నడువుము. నడువుము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.







# కాంతామతి.



## ద్వితీయాంకము.



రంగము—చెరసాల

(కాంతామతి యొక్కపలను, వెలుపల నిరువురు భటులు పరివేష్టించియున్నారు)

కాంతా—హా! ప్రాణేశ్వరా! సంకేతారాధితమేశ్వరా! ఆవ దాననగు నాయందు నీకెంత దయ లేకపోయెను?.

సీ. భర్తృపాదంబుల బలుమారుపూజించి
కనులఁ జూచునదియె కలికిమిన్న
మగనికనుకూలపుల మాన్యత జేయుచు
ముదమొసంగునదియె ముగ్ధకొమ్మ
దపుడికనేసన్నల దగ గ్రహియించుచు
మెలఁగనేర్చినయదె మించుబోడి
విభుననారతము భక్తిగొలుచుచుం
బునఁ జెలంగి యదె పుణ్యశీల
గీ. నాథుతో గూడి చెలరేగి నారులందు
మేటియనగను బ్రఖ్యాతిమించుఁ గాక
నాయుసురులేల వానిని బాయవలయు
యుసిపగామ వన్నెలపోల్కె నయ్య బ్రదుకు.

బడితి నన్నుబోలెడువారు వసుధయందు
గలరె యెటువంటి హీనుల కులమునందు.

మ. మగనింబాసి మనోవ్యథం గుడిచి సమ్మానంబు జెందంగ లే
క గచాట్లంబడు నన్ను వంటియధమల్ యాధోధిభృద్దారుణిం
దగనాలోచన జేయగందు మొకో యాధారంబు లేదయ్యె నా
వగలంబాయు విధానమున్నదె మహిం బ్రారబ్ధముం బాపగన్॥

కటా! నావంటి దురదృష్టవంతురాలు లేదు. ఎందునకుం గొఱగాని జన్మమొంది పలుబాముల నొందుచు గఠినపుకారయందుంపఁబడిన వయుచుండియు నాశా పాశంబుల ద్రెంపలేకుంటిని, కానిమ్ము. సర్వమునకా జగజ్జనకుఁడే కలఁడు.

(శక్తివర్మ ప్రవేశించును.)

శక్తి—(తనలో)

గీ. సుతకుఁ బెండ్లియొనర్చి పంపితిని నేటి
వరకుఁ గుశలవార్తావళుల రయరావు
కారణంబెద్దియుండెనో కాంచుకాంతు
జేసి చనుదెంచినాడను శీఘ్రగతిని.

లేక లేక కన్న సంతానమగుటచే విడువలేక పంపితిని. ఆడుబిడ్డలెప్పుడు పరాధీనలుకదా?

గీ. తల్లిఘోషించుబిడ్డకు దావ్వహమిప్ప
డేలయంచును సంబంధమెప్పగొప్ప
దిట్టిదిమరల రాదంచు పట్టుపట్టి
దిట్టనై ముడిపెట్టితి పట్టినిట్లు.

(ఇటునటు పరికించి కాంతామతినిజూచి) హా! ఇదియేమి యాశ్చర్యము. అనేక దాసదాసీపరివృతయై మహోపచారములం జేయించుకొ

సుగొంతు మహారాజ కుమారివగు నాపసినిసుంగునకీ బంధనాగార నివాసమేల? (అనిలోనఁ బ్రవేశించుచున్నాఁడు.)

వేగ—(అడ్డగించి) ఆగుమాగుము. మా రాజుగారి యుత్తరవు లేనిదే యెవారికిందు బ్రవేశింపరాదు.

శక్తి—అక్కటా! ఏమిదురవస్థ (భటునితో) నాకుమార్తె నింటంచే జూడవచ్చితిని.

గుణ—అయ్యా! మీరెవరైనను మా ప్రభువుగారి సెలవు పొంది రావలెను.

శక్తి—అయ్యలారా! మీరిట్లాడుట ధర్మమా! మీబిడ్డలే యిట్టి కష్టములం బొందుచుండ జూచి మీరెట్లు తలంతురు?

వేగ—అయ్యా! మీరేమనినను లోనికిమాత్రము జొరనీయము

శక్తి—హా! మీహృదయములు శిలామయములుగానున్నవి. ప్రకృతిజ్ఞానము లేశమాత్రము మీమనస్సుల నాటినట్లులేదు.

గుణ—అయ్యా! మమ్మునిందించిన లాభమేమి? రాజశాసన మట్టిది.

కాంతా—హా దైవమా!

గీ. కన్నతండ్రినివీక్షింప గాంక్షయున్న
నను వుకాదయ్యె నిందుఁ మనసుదీర
నే జనింపలేదుపితల కెంచిచూడ
తండ్రిచెఱసాల దుఃఖముతల్లియయ్యె.

భటులారా! నాయందు మీకు దయకలదేని నాతండ్రి నిందురానిండు.

గుణ—తల్లీ! నీ విట్లనజెల్లునా? మేమేమి చేయగలము. ఇది గొంచెము రాజుగారికి దెలిసినదో మా మానప్రాణములు దక్కవు.

శక్తి—హాతనయా! నీకెట్టివిపత్తు సంభవించెనే? అయ్యయ్యో!

నవలావణ్యలావణ్యవతీశిరోమణివై మృదుతల్పంబున మేనుజేర్చి నిరుప మానసుఖాబ్ధి నోలలాడు నీకీవిధి కఠినశిలాతలంబునఁ దేహంబు గందజే యవలసివచ్చెనే తల్లీ!

సీ. సురుచిరపరిపక్వ శద్ధోదనంబును
కసిగ ట్లినమలెడి నినుఁగుఱీవు;
రవశియమ్మృదు దుకూలములను మెయిదాల్చ
బెగడొందుముద్దుల బిడ్డవీవు
పు పురుఁవారికలు సతెం బుఁచాగ
మొనరింపవరలెడి ఆ యవీవు
ట్లరుపల్లవంబున బవళింపమృదుశగ
రముగందవెంబడు గామీవు

గీ. నే ఎ ర్రముసుదిని నిచ యన
గాగట్టి మొక లె నీకజెడగ
కలు బండంగ గాంచు యొ
టా! నైవవంచన ద్రవరోము.

(భర్తను జూచి) ప్రకరుణాకులారా! నాయందు దయయుంచి (తనలో) ఫ వీరిని బార్థింపవలసి దేమి? లోన బడఁగూడదా? "ఘాలగోకు రాతినిమోయు" మనినట్లు నాబిడ్డనుగూర్చి కొంత శాంతివహించవలెను. (ప్రకాశముగా) నాయనులగు గూతుంజూడనిండు

రెం—రాజోత్తమా! మీయాజ్ఞల నతిక్రమించిన సేవకుల మన్నింతురా!

ఒ—కష్టనిష్ఠురములను గొంచెము యోజించవలెను.

రెం—తినుచున్నయన్నమున మన్నుగొట్టుకొనవలెను.

ఒ—హా! ఎంతకష్టము.

గీ. హితులమాటలవిననట్టి యెట్టిదేని
బాపుకంబునుబొందంగ బాలుపడెను
నే నదృష్టాంతమైతిని నిశ్చయముగ
సతిహితముజెప్ప చెవిబెట్ట సాహసమున.

హా! కుమారీ! వసంతలక్ష్మీసమానమనోహారీ!

గీ. కన్నకడుపని మదిలోన నెన్నకుండ
తనయకును బెక్కుకష్టముల్ దార్చినాఁడ
ననువుగానట్టిబాంధవ్య మలముకొనఁగ
బూనునావంటిఖలుజూడబోరు వెదకి.

కాంతా—ఓయన్నలార! కడుగారాబమున బెంచి పెద్దజేసి నా యోగక్షేమ మరయ జనుదెంచిన నాపితృజనకుని దరిజేరనీయక యడ్డుచున్నారా? ఇది మీకు దగునా? లోనికి విడిచినంతమాత్రమునను మీ సేవకధర్మమునకు భంగముకలుగునా? నన్నుజూచియైన లోపలకు రానిండు

గుణ—ఓతల్లీ! చండశాసనులగు మహారాజుగారు వినిరేని యాస్థానంబునకు వెలియగుదుము.

శక్తి—మీకట్టి భయమక్కరలేదు. ఏదేని విపత్తుకలిగినచో నేను పోషించెదను

వేగ—తినుచున్నయన్నము బోర్లదోసికొనిన ముందు మంచి కూడు లభించునా? ఇవేటిమాటలు? మమ్ము మీరుమాత్రము స్వామి ద్రోహులని నిరసింపకుందురా?

గుణ—మీరెంతి మహారాజులైనను దరిద్ర్యాపేక్షజూపి లోబ లుపనెంతురా?

కాంతా—కటా! ఎట్టి దురదృష్టవతిని. నా సేవకులకు గూడ

లోకువనై ప్రార్థించుచున్నను నిరాకరింపఁబడుచుంటిని. "మగడో ల్లకున్న మారియునోల్ల" దనుట నేఁడు నిజమయినది.

సేగ—(తనలో) ఈమె దుఃఖముచూడగా వజ్రహృదయమగు నాహృదయము కరగి నీరగుచున్నది. ఏమేని కానిమ్ము. (ప్రకాశ)

గీ. తాల్మినీయాజ్ఞ శిరమునఁ దాల్చియెపుడు
నగ్గిఁబడుఁడన్నఁ బడువార మబ్ధిలోన
గూలుఁడనఁగను గూలంగఁ జాలువార
మాత్మజాతవు నీతండ్రి నయుమమ్మ.

(అని శక్తివర్మను లోనికి బంపుచున్నాఁడు.)

శక్తి—(లోనికిఁజని కూలఁబడి) హాతనయా!

గీ. అభినవశిరీష సుమదామ మర్క కిరణ
జాలమాగుంచునట్లు దయాలవంబు
లేక కొట్టుకష్పించి లేనిపోని
వెతలపాల్జేసినాఁడను బిడ్డనిన్ను.

సకలభోగంబులనుభవింతువని యెంచియుంటినిగాని యిట్లు సుఖహీనురాలవగుదువని తలంపనైతిని.

కాంతా—జనకా! నా యదృష్టంబునకు నీవేమిచేయఁగలవు?

శక్తి—

గీ. ఎట్టినిరుపేదకైనను బుట్టలేని
కలియొ, గంజియొత్రావుచు కాలముపెన
గమపుదుపుకిద భూకాంతు కాంతవయ్యు
నేమిసౌఖ్యంబునందితి విందుతల్లి.

అమ్మా! నీవిట్టి కఠినపు చెఱసాల నుంపఁబడుటకు గతంబేమి?

కాంతా—తండ్రి! ఏమని తెల్పుదును.

శక్తి—అమ్మా! జరిగినదానిని దాపక జెప్పుము, తగిన ప్రతీకార మాలోచింతును.

కాంతా—జనకా! నా యుద్యానవనమందు నొకనాటి మధ్యాహ్నము చెలిమికత్తెలతో గూడి విహరించుచుంటిని. అట్టిసమయమున నొకమనుజుఁడు చనుదెంచి,

క. ఎండబడి నడిచివచ్చితి
మెండుకొనెందాహభరము మించెడుతాపం
బెండెం నాలుక తడి వే
దండగ మనశ్శీరమొసఁగి దగదీర్పదగుఁన్. అని నుడివె.

శక్తి—తర్వాత

కాంతా—కొంటెతనమున నారముగ్గిన యల్లనేరేడిపండును గోసి యునుకపైవైచితిని.

శక్తి—పిదప

కాంతా—ఆయన పండుతీసి యూదబోవుచుండ "ఊదకు ఊదకు బావా నీ మీసము కమిలెను బావా" అని హేళనగా పలికితిని.

శక్తి—(తనలో)

గీ. ఎట్టివల్మీకమందున నెట్టిసర్ప
ముండునో యెట్టిజనుఁడు ప్రచండుడగునో
ఎట్టితృణమెట్టిమందున కేరుపడెనొ
తెలియలేరు మూఢమతుల్ సుధీరులట్లు.

ఆయన విక్రమార్క సార్వభౌముఁడు కాఁబోలును. ఆఱుమాసములు రాజ్యపాలనయు నాఱుమాసములు భూసంచారమును జేయుచుండునని వినికి (ప్రకా) పిమ్మట.

వేగ—మన కాపులో నున్నవారు మఱియొకవిధముగా జరుపుటకు శక్యముకాదే? బ్రహ్మదేవునకైన వీలుకానప్పుడు మనుష్యమాత్రులకాము సాధ్య. ఏల వెఱ్ఱి వడెదవు?

గుణ—ప్రాణము విసిగినప్పుడు స్త్రీలెంతపనికైన సాహసింతురు

వేగ—చాలు నీవన్నియు సత్యకాలపుమాటలు. ఇప్పుడు మగని దానునిగా జేసికొనకున్న జాలును.

కాంతా—తండ్రీ! నన్నుకోలు నిర్భాగ్యురాల నేలగల్పించితివి? సర్వసన్నద్ధుడవయ్యు విక్తునివగిది యుండదగునే?

శక్తి—అమ్మా! వగవకుము. నీకెన్నండును విపత్తు గలుగదు. సర్వము దైవాధీనము. భరింపరాని దుఃఖము కలిగినప్పుడే ధైర్య మవలంబించవలయును. వగల బొగులకుము. నీకేదియో మంచి దారి దొఱక వచ్చును.

కాంతా—తండ్రీ! నాకధోమార్గమే శరణు. ఇంతకన్న వేఱు త్రోవలేదు.

శక్తి—(లోలో) అదోమార్గమనుచున్నది. అనగా, నేలయుదుగునుండి త్రోవగల్పింపుమనుచున్నది. (ప్రకా) దైవము నీయందుండి నదో మంచితెఱవు దొఱకవచ్చును. సన్మార్గులకాపదలు కొండలవలె నున్నను తుదకు మంచిగనే పరిణమించును.

కాంతా—అవన్నియుకల్ల, నావంటి యదృష్టహీనురాలికి మాత్రము శుభము కలుగనేకలుగదు. కారాగారంబునందుండి సదా దుఃఖాక్రాంత స్వాంతనగుటచే వివేచనాశక్తి లేకున్నది. ఎప్పటికైన బ్రదికి బైటంబడుట తటస్థించునా? అట్టిభాగ్యము కలుగునా? మన్నాథుండు మన్నించునా? నావిపత్తు పోగొట్టువారుందురా? హా!

గీ. సహజమిత్రుండు పగలిటి పనులదీర్చి
శ్రీమసుబాపంగనెంచి వారాశిజేరి
వృద్ధభర్తసూతన భార్యఁబ్రేమఁజూచు
(తనలో) నట్లు రక్తిమబూని గ్రుంకంగఁదొడఁగె.

గుణ—వీఁడు సాయంకాలవర్ణనామిషచే నన్నెట్టులెత్తిపొడుచు చున్నాఁడో? నాకు బహుభార్యకలదనియు, దానినొక నిముషమైన వదలనేరననియు జెప్పుచున్నాఁడు. (పైకి)

గీ. రాగయాభార్య మగనిపరాకుదీర
నెత్తిపైఁగొట్ట నెత్తురు నీటుదొరఁగ
ముఖముపై బాఱినట్టుల బుష్కరమణి
రక్తిమంబూని వర్ణింప శక్తిగలదె.

వేగ—(తనలో) ఏమీ, వీనియుదుటుబోతుతనము. "ముసలి వాఁడు పడుచుభార్యను ప్రేమించునట్లు" ని యుపమింపఁగాఁదన్న ధిక్కే పించితినని తలఁచి "నాభార్యనన్ను గొట్టుచున్న" దని యెత్తిపొడుచు చున్నాఁడు. వీనికి దగినట్లుత్తరమిచ్చెదను. (ప్రకా)

ఆ. వె. భార్య యశ్వజాతి బాములబడఁజేయు
నెట్లు వశముజేయ నెంచువాఁడ
ననుచు జింతనొందు నతివృద్ధుఁడగు భర్త
విధము సూర్యుఁడెలమి విడచెగాంతి.

గుణ—(తనలో) "నాభార్య కుట్టితనమున జిక్కులు పెట్టు చున్న" దని యూహించుచున్నాఁడు.

చ. తమియనుజారకాంత మరుతాపభరంబున జారుఁజేర శీ
లముచెడునంచు భీతినిగలంగిన చిత్తము నమ్మనుంగు కుం

దములురచించినట్టి గగనంబను నీలదుకూలమంచు చం
దమునబ్రకాశమయ్యె దివిదారలు చీఁకటులుం గ్రమంబునన్.

వేగ—(తనలో) నేనొకచెడిపను దెచ్చుకొంటినని ఎట్లు దెప్పు చున్నాఁడో "కలహమునగాని కులముతేల" దనునట్లు మాలోమేము వివాదపడుట మంచిదికాదు. (ప్రకా) నీకు భోజనపువేళదాటుచున్నది. నీవువెళ్లిరమ్ము.

గుణ—(తనలో) వీఁడు నామాటలకు సిగ్గుపడినట్లున్నది. ఒక రిని నొప్పించుట తప్పుకదా? వీనిని క్షమార్పణవేడుకొనెదను. (ప్రకా) నాయనా! ఉత్తవాఁడవు. ఆకలిబాధకుఁ దాళలేవు. నీవు ముందుగవెళ్లి రమ్ము. నే నేదేని యంటినా యది నల్లమందు తిక్కగాని మతి యొకటి కాదు.

వేగ—(తనలో) పశ్చాత్తాపమొందినట్లున్నాఁడు. (ప్రకా) పెద్దవారు సర్వత్రపూజింపఁదగినవారు. నేనువచ్చునప్పుడే భుజించితిని. నీవు వెళ్లిరమ్ము.

గుణ—సరే. (అని నిష్క్రమించును.)

కాంతా— హా! నాబ్రదుకెంతహీనమైనది. నేనోచిననోము ఫల మెట్టితీరున ఫలించెను? (రాత్రియాటచూచి) నేడు నాకనుకూల రీతి గాల్పించుచున్నది. ఏమన,

ఆ. వె. మబ్బుగ్రమ్మరాత్రి మస్కరులకు బ్రీతి
నింపుచుండె దారలెల్లమినుకు
మినుకుమనుట వీడమేళవించెను పెను
జీఁకటెల్ల దిశలతీఁకయొడల.

(లోన ధ్వనియగును,)

(విని) ఈచప్పుడెక్కడనుండి బయలుదేరినదో యరిసెద. (అని పరిక్రమించుచు సురంగమును చూచి తనలో) సరి, నేననిన దంతయు నా తండ్రి పూర్తిచేసెను. వీండు నిద్రించిన తర్వాత నిందుండి వెడలెదను. (ప్రకా) ఓరీ! వేగవంతా!

వేగ—అమ్మా! ఏమి సెలవు.

కాంతా—ఏమి...నిను నేపిలచితినా?

వేగ—ఏమి, ఈమె యిట్లాడుచున్నది (ప్రకా) అమ్మా! ఇప్పుడే పిలచితిరి.

కాంతా—అయ్యయో! మోసమువచ్చెనే ఎంత తెలివితక్కువ పనిజేసితిని. (ప్రకా) ఓరీ! నీపనియేమియులేదు. నీస్థానమున జాగ్రత్తగా నుండుము. (తనలో) నాధా! నన్నూరక బాధించి నాసాహసము జూపు నటుల జేయుచుంటివి నేనేమిచేయఁగలను. ఇందు నాతప్పు వేశమైన లేదు. నీపదంబే శరణు.

క. ముక్తికి మోదంబున కను
రక్తికి గౌరవమునకును రమణికి నెపుడున్
భక్తికి యుక్తికి శక్తికి
సక్తంబౌనట్టినీదు చరణములెంతున్ మఱియు,

ఉ. నేరములేదు నాయెడల నీదగు నాజ్ఞను బూనియుండుటన్
గారనువాయగావలసె కార్యముచక్కనొనర్పనెంచి భూ
మీరమణా! కుమోదము సమీహితమయ్యెడు కన్నకాంతలం
దూరమునందునుంచుటయె తోషమటంచు దలంతులేకనన్.

(ప్రక) ఓరీ!

వేగ—అమ్మా!

కాంతా—గుణవంతుఁడు రాగానే—(అని యూరకుండును.)

వేగ—గుణవంతుఁడు రాగానే ఏమి చేయుమని సెలవు?

కాంతా—(తనలో) ప్రమాదము సంభవించు లాగున్నది.
(ప్రకా) వాఁడు రాగానే నాకు కనఁబడుమని చెప్పుము

వేగ—చిత్తము. దేవీ! చిత్తము. అదుగో గుణవంతుఁడు.

గుణ—(ప్రవేశించి వేగవంతునితో) ఏమి విశేషములు.

వేగ—ఏమియులేవు. నిన్ను అమ్మగారు పిలిచినారు.

గుణ—అమ్మా! ఏమి సెలవు?

కాంతా—(తనలో) వీనితో నా ప్రయత్నము చెప్పుదునా? ఏమి నా వెఱ్ఱి. (ప్రకాశ) ఏమియులేదు. ఊరకనే యడిగితిని. మీమీ స్థానంబులకు బోయి పండుకొనుడు.

భటులు—దేవీ! చిత్తము. (అని పండుకొనుచున్నారు.)

కాంతా—(కొంతసేపుండి) ఆహా! ఏమి వీరిగుఱ్ఱు. అప్పుడే నిద్ర బట్టినది. కానొను వారికేమివిచారము. నాబోటి విచారభారభరితహృదయకు నిద్ర కడుదూరము. నాయీప్రయత్నము దైవమెట్లు నెరవేర్చునో తెలియదు. పురుషకార మున్నమీదటగదా దైవసాయము. కావున నెట్లైన బ్రయత్నింపక తప్పదు. (అని యిటునటు పరిక్రమించి తన్నుబోలియున్న బొమ్మను దీసిచూచుచు)

గీ. ఒనర నారూపునొందిన యుజ్వలాంగి
నాదు యత్నంబుదీర్ప సన్నద్ధమైతి
విందు కపటంబులెల్ల పొందకుండ
నిల్పియోబొమ్మ! పోయెద నెనరునిల్పు.

(అని బొమ్మను తనపత్రికపైఁ బరుండఁబెట్టి నిండుగా ముసుఁగువైచి) దీని నిక్కడనుంచితిని. నేను వెళ్లినబిదప నెవరైన దీని దాకిన. నో గపటము వెల్లడికాక మానదు. (అని యోజించి ఒక కమ్మవ్రాసి పత్రికను బడవైచి భర్త నుద్దేశించి) మనోహరా! నాయందు దప్పు కలదేని మన్నింపుము. (భటులను జూచి) నన్నుంచి యీభటుల కేమానియు రాకుండును గాత.

(అని సురంగమార్గమున నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.





# కాంతామతి



## తృతీయాంకము.



రంగము—చెరసాలద్వారము.

[వేగవంతుఁడు, గుణవంతుఁడు నను నిరువురు భటులు ప్రవేశింతురు.]

గుణ — వేగవంతా! అటు చూడుము,

గీ. లోకవిజ్ఞానహీన జాల్మని మనంబు
నందు విలసిల్లుజ్ఞానంబు చందమునను
దారకల్లోలవంబున దాయుచుండె
స్వీయతేజంబు విడనాడి విన్ననగుచు.

వేగ — తారలు తరలుటె కాదు.

ఉ. రాతిరివేళఛాయ యనురాగమునన్ హరిచందనంబుచే
చేతముదృప్తిజేయ గమశీఘ్రగతిన్ దినవాధుఁడౌట దా
బ్రాతి నిశాంకముల్లడఁగ బాష్పజలరాశినిముగ్గివేచు న
ట్లాతతరక్తదీప్తి జలజాప్తుఁడు దూర్పునదోఁచె వింతగన్

ఏమిది చూచుచుండగనే ప్రొద్దెక్కినది. ప్రతివాని యాయువు నిట్లే తూటువడిన యోటికుండలోని నీటివలె తరిగి పోవుచుండును కాఁబోలు.

గుణ—ఏవేళ కేదివచ్చునో యెవరు చెప్పఁగలరు.

వేగ—చెప్పుట కేమున్నది. అటు దిలకింపుము. బంగారు ప ళ్లెరమున దివ్యాన్నముంగొని మదనమాలిని వచ్చుచున్నది.

చ. ఘుమఘుమవాసనల్ దిశలకున్వెదజల్లుచు నిష్టతర్పణం
బు నిఁగుల నాసికందనుపు పొల్పెసరారు పరిశస్తశస్త శా
కములుపసిండి గిండెగుతుకంబునదాల్చి వికాశమొప్ప వ
చ్చుచుదుని బాణమా యనఁగ సొంపువహించి విలాసవైఖరిన్.

(మునుఁ జెప్పఁబడిన ప్రకారము దివ్యాన్నముగొని మదనమాలిని ప్రవేశించుచున్నది.)

మద—(తనలో) ఈమె సుగుణములుచూచి మనస్సున మిక్కిలి చింతిల్లుచు నెప్పటికైన భూనాయకున కీమెయం దాదరము కలుగు నేమో యని యోర్చియుంటిని. పెక్కుయత్నములు చేసియు గార్యసాఫల్యము గాంచనైతిని. ఎన్నిబాధలకైన సహించు నీమె మనోదార్ఢ్యము ప్రిసుసాక్ష్యముకదా? (చటులనుచూచి చిరునవ్వునవ్వుచు లోన బ్రవేశించి పరిక్రమించుచు పైకి) ఈమె నేను చాలప్రొద్దెక్కువరకు బండికొనియున్నదే. (ముసుఁగుతీసి) అమ్మా! అమ్మా! లెండు, లెండు! భోజనపువేళ మించిపోవుచున్నది. (అనిపిలిచి పలుకకుండుటచే శంకించి పరిశీలించిచూచి ప్రాణము పోయినట్లూహించి విస్మయవిచారములతో) ఎంతపనిజరిగినది భటులారా! కొంపమునిఁగినది

వేగ—గుణ—(తొందరతో) ఏమేమి?

మద—ఇంక నేమున్నది. (ఏడ్చుచు) అమ్మగారు!

ఇరువురు—ఏమి అమ్మగారి కేమి? వేగజెప్పుము.

మద—నేను చెప్పలేనమ్మయొ్యా! (అని యేడ్చును.)

ఇరు—(తొందరతో) ఏమి చెప్పలేవు! కులాసాగా నున్నారా?

మద—నాకు తెలియదమ్మా, (అని యేడ్చును)

ఇరు—(దగ్గఱకుజేరి పరిశీలించి) ఇంకేమున్నది. అమ్మగారు (అని యేడ్చుచున్నారు.)

మద—(ఏడ్చును) ఎంతమంచిదానవు నాతల్లి! నీకీదుర్మరణమే విధివచ్చెనమ్మా!

ఇరు—(కొంచెముతేరి) మదనమాలినీ! ఏడువకుము. ఇపుడు చేయవలసినపని యేమి?

మద—ఏమున్నదో నాకుతెలియదు.

గుణ—(విచారముతో) మనకిఁక మానప్రాణములు దక్కవు. అమ్మా! మాకేమిదారి కల్పించితివి.

సీ. బత్తెంబునందున భాగంబుగొనువారు
  కఠినులై చఱసాలగాచువారు
పనులందువిశ్రాంతి బడయనీయనివారు
  చేతిసొమ్మెల్లను జేదువారు
దోషికాదనుటంచుఁ దొడరిగొట్టెడువారు
  కొట్టియామీఁదను దిట్టువారు
పైశిహరించెనీ పాపియనెడువారు
  దానిగొనివిడువ రానువారు.

గీ. నిట్టిదుష్టాధిపత్యంబు నేహ్యముగద
వారికో లెనీసాధ్విని కారలోన
బాధపెట్టుటలేదుగా పావులమయి
యేలయీచెట్టవచ్చె నహీనముగను.

ఎట్టి యపఖ్యాతి పాలైతిమి?

వేగ—అపఖ్యాతిమాటటుంచుము ముందు జీవములున్నగదా? అయ్యయ్యో! దివాణమునందు నూకలిఁక మనకు లేవుకాఁబోలు.

మద—అమ్మా! ఎంతవిపదగూర్చితివి? అన్నములో విషమిడి యూపెట్టించంపితినని ముందుగా నాతలగొట్టింతురు. నేనేమని వేడు కొందును.

గీ. దాసీలకు దొరసానిపై విభక్తి
యుండదందురు నిజమగును విదమిన్న
యేనుదలఁపను ప్రిభ్రికయిష్టశృక్య
మహహా! నాబ్రిదుకున కేమి హానికలదొ?

గీ ఏమిసేతునుదైవ మీయెడనుక్రూరుఁ
డై వృథాపవాదము బడనాజ్ఞయిడెనొ
నృపతిమన్నింప నాపాలకృపను గలఁడొ
చావనుదుటను వారితినుజంపినారొ.

తల్లీ! నీపోకలవు గతించి పదుగురకు హాని తటస్థింపఁజేసితివి.

గుణ—సీ. మర్యాదగోల్పోయి మహిని జీవించుట
కన్నను పాపంబు కలదెజగతి

వేగ—మనుజేశునకు గోత్రధనమునుగల్లజేసితిగా
మీఁదనుబ్రాణాల మెలపవశమె

మదన—రాజురక్షించిన బ్రజలోనఁదలయెత్తి
యేక్రియమెలగంగ నెంచఁగలము

గుణ—కలవిధంబంతయు కల్లకేకను దెల్పి
క్షమియింప వేడుటేసాధకంబు

వేగ—గీ. ఎటులచక్కని యోచననెన్నికాని
మమ్ము కాపాడదగినట్టి మాన్యబుద్ధి

మదన—వరయు నీయుపకారము మరవగలమె
తోడుపడవయ్య కృపతోడు వేడుచుంటి.

గుణ—నాకొకయుక్తి తోచుచున్నది.

వేగ—అదేది.

మద—త్వరగ జెప్పుము.

గుణ—రాజుగారి కెఱింగింతము

మద—ఎవరు వెళ్లి చెప్పగలరు. ఓయమ్మా! నేను వెళ్లి చెప్పలేనే

గుణ—నేను ముసలివాఁడను కదా భయముచే వడకుచునే
నూటకేమాట చెప్పి దొంతుకమీఁదకు దెత్తునో.

వేగ—(తనలో) ఇఁకదిక్కేది? నానెత్తినిబడినది. (ప్రకా) మీ
రిక్కడనుండుడు. నేరాజుగారిని దీసికొనివచ్చెదను.

గుణ—వేగ రమ్ము.

వేగ—ఇదిగో యిప్పుడే వచ్చెదను. (నిష్క్రమించి విక్రమా
ర్కమహారాజుతోఁ బ్రవేశించును)

విక్రి—ఏమి గా? రాత్రివరకు కుశలముగా నున్నదనుచుంటివి.
ఇంతలో నాకస్మికముగా మరణించుట కేమి కారణము. మీయుండేదో
లోటుకలదు.

వేగ—మహాప్రభువా? ఒకటి రెండుసారులు పరాకుమాటలాడి
నారు.

విక్రి—అప్పుడే నాతో జెప్పవలసినది.

వేగ—ప్రభువా! అదియొక్కటే మాలోటు.

విక్రి—(తనలో) అట్టి మనోహరాకార లభించినప్పుడూరక
వెట్టినై చెడితిని.

గీ. కొద్దిహేతువులకై మదిఁ గొవ్వ తప్పి
దములుగాఁగ నెంచి నృపులు దయలు గారు
వారిహృదయముల్ క్రూరముల్ వసుధయందు
రాజనామ మహంకార బీజముకద.

(పరిక్రమించుచు శవమును గాంచి పరితాపముగా) హా! మనో
హారిణీ! నిరుపమాన లావణ్యతారుణ్యగణ్యా! కుసుమకోమల కోమ
లాంగీ! నీకీవిధిని కృష్టకష్టమరణము గల్పించిన యీమూర్ఖున కేమి
గతి చెప్పితివి? అయ్యయో! ఎట్టి దుర్మార్గుఁడను.

చ. నవనవనీరజంబు వదనంబు పరితాపము తప్పి నైల్యముల్
సవసవగాంచె శ్రీలలిత చక్షుయుగంబు నిమీలితంబునై
పరివిమలకాంతి బాసె కట! ధర్మవిరాకరణంబు దేహ మీ
భువిలోఁ బగాక యగ్ని కిడఁబోల్పు వహింతునె మోహనాంగిరో.

(దగ్గఱఁ జేరి) హా మధురవాణీ! నేఁ జేసిన యపరాధంబునకై నన్ను
జూడకుంటివా?

గీ. పట్టియభిమానమును బూని కట్టుకొన్న
దానిఁ గవఁగూడ కెంతయుఁ దాపమొంద
జేసియుంటి నిషంబు నిజేరు రంభ
పోల్కె నా పాత్తు నీకెట్టి ముదమొసంగ.

(ప్రక్కను గూర్చుండి) సుదతీ! నా పెన్నిధానమా! నా భాగ్యరాశీ!

చ. నిగనిగలాడుచున్ మిగుల నీటు ధరించెడు చెక్కుటద్దముల్
వగలదురంగవించు ముఖపద్మవిరోధియ హీనకాంతియుం
బగిబిగిమించు మోవిరుచి వెల్లవము చిత్తమునందు నెన్నఁడున్
మగువ! దలంపరాని సుఖమగ్నుని జేయు పెక్కుభంగులన్

సుందరీ! నీయందంబు చందంబుగాంచియు గనులకుం బొరలుక్రమ్మిమదుర హంకారమగ్నుండనై నిన్ను వీడితినని కోపించితివా? నాయపరాధంబు సైరింపుము. కన్నులు తెరచిచూడుము. ఒకపలుకు పలుకుము. అయ్యయ్యో!

సీ. బంగారురంగారు పట్టుదుకూలముల్
గుట్టలుబడె గనుగొనవదేమి?
నవరత్నమండిత నవ్యభూషణములు
గుట్టలుబడె గనుగొనవదేమి?
దాసదాసీజన తండములరుదెంచె
కుతుకంబునను గనుగొనవదేమి?
నీముద్దురాచిల్క నిల్చియున్నదిచెంత
కుతుకంబునను గనుగొనవదేమి?

గీ. రాగహీనుండు భర్తనురాగనుండు
చూడనేటికి నశ్వరభోగ్యములని
కోపమూనుచు నీక్షింపఁ గోరవొక్కొ
చిత్తమిప్పింతు కృపమూని చెల్వఁజూడ.

వేగ—(మొదలగువారు విచారము సూచించుచున్నారు)

విశ్వా—సుధాంశుముఖీ! ఎట్లకష్టింపువే? మనము కలిసియుంటి మోకాల యన్యోన్యప్రేమ గలిగియుండియు నెయ్యముమాత్రము నిల్చినదికాదు. అక్కటా నినేమిచేతును. పెక్కురీతుల చెప్పితిని నేనెదు ర్మార్గుండనై నీహితవువినక నిర్బంధించితిని. ఆబెంగనిను గ్రంగదీసెను. సర్వవిధములఁ జెడితిని. ఛీ! సాధ్వీంజంఘాలావా కీయుసురుతో బనేమి

గుణ—మహారాజా! సర్వధర్మజ్ఞులగు దేవరవారే దారి జూపెదరు?

ఆత్మహత్య పాతకములలోనెల్ల ఘోరపాతకముకదా? మమ్మాగాంచి తత్సాహసము మానుటొప్పును.

విక్రమ—(విలపించుకొనక) హాసుకుమారీ.

చ. విడచితివేమనోవిభుని వేసటచేపరిచారికావళిన్
విడచితివేసుభూషలను వీడితివేశుకశారికాదులన్
విడచితివేసతంబు వెతవేగుచునుంటివటంచుజీవముల్
విడచితివీవుసర్వమును వీడఁడునీపతినిన్నునెంచుటల్.

(అని శోకోద్రేకముచే గౌఁగిలించుకొనఁబోయి ప్రక్కనుబడియున్న చీటింగాంచి) ఇదేమి? ఇచ్చట చీటిగన్పించుచున్నదే? ఇందేమున్నదో చదివిచూచెదను ‚‚శ్రీమదనంతాధినాథులును" నిన్ను విడచిన తర్వాత నధినాథత్వమెక్కడ? అనాథుఁడనుము ‚‚గర్వితారాతిభూభృత్కవిశాయుదులును" నీవు చెంతలేనప్పుడామాటసున్న ‚‚నిర్వక్రవిక్రమక్రమితవిక్రమార్క సార్వభౌముని పాదపద్మముల సన్నిధికి" సార్వభౌమునకెంమను వనవాసమేశరణు ‚‚తావకాక్షీణకటాక్ష వీక్షణామృతాస్వాదతాఁంగి సంతోష భంభరాయమానమానసయగు కాంతామతి నమస్కారములు" అయ్యయో! చావనున్నప్పుడుకూడ వినయవిధేయతలజూపవలెనా? ఎట్టి యుత్తమకులోత్పన్నవు? ఎట్టిగుణనిధివి. అట్టిరత్నమనగు నీవెట్లినిర్భాగ్యునకు దక్కుదువు? ‚‚నాథా" ఇంకెక్కడి నాథుఁడు? సంసారికము జీవములున్నంతవఱకెగద ‚‚తావకోదగ్రక్రోధానలమున కుశలభంబనగు" నిజముట్లులనేయైతివి. ‚‚నేజేయు విజ్ఞప్తిసావధానముగ నవలోకింపఁ గోరెద" ఇఁక నేమిచేసెదను. సావకాశము కావలసినంత యుబ్బినది. బ్రతికినన్ని దినములు నిన్ను సుఖపెట్టలేకపోయితినిగాని యిప్పుడానందముతో సావధాన మూనెదను. ‚‚దేవా"

అయ్యో! ఈవినయ సౌశీల్యము గర్భ నిర్భేదకరముగదా? "నిష్కా రణముగా నన్నీకఠిన నిర్బంధమున నుంచినందునకై కలుగు నఘము మీకుఁజెందక నాకథోగతిని బ్రాప్తింపఁ జేయునుగాత" యనుచున్నదు గుమ్మా! బంగారుబొమ్మా! చిన్నికొమ్మా!

చ. నరకమునందుఁగూలిన ఘనంబుగస్వర్గమునందునున్న నా
కరమణితో బనేమనుచు గూళతనంబును జెందవయ్యయో!
సరసుఁడుగాని భర్తకయి చాలఁగఁ బొక్కెడు నీకృపామతిం
దరమె నుతింప సుందరసుధాకర నిర్జిత శోభితాననా?.

గీ. కారనుంచినవానిపై గరుణబూని
నీమృదుగుణంబు బ్రకటించినేఁడువిమల
కీర్తినందితివీవన్న కేవలంబు
పాతివ్రత్యముచును జెందంబుసాక్ష్యమిచ్చె.

అయ్యయో! నేనిట్టినిందితకార్య మొనర్చితిని. ఎట్టిజననిందకుఁ బాతుఁడనైతిని. "నాథా! పతికన్న ముందుగ సతిమరణించిన నుత్తమ గతికేగుదురని పెద్దలాడుదురు. అట్టిసుకృతము ఫలించినందుకై సంత సించుచుంటిని." నీవెప్పుడు సుకృతవంతురాలవె.

ఉ. నాదగుభాగ్యలక్ష్మి తగునాయమృతంపు నిధానమాకటం
బేదనుజేసిచిత్తముఁ బ్రేమముడివీడిదివంబుఁజేరెతో
మేదురబుద్ధిశాలిని యమేయగుణాఢ్య ఖవత్సుకృత్యమే
వాదనులేకగా చెముగునా! ననుగా చెనెపాపినోటచేఁ

గీ. కాంత! కడుపుణ్యవౌటచే గాంచగల్గె
స్వర్గభోగంబుసతము భావ్యమగుచు
నీకుభర్తనయ్యు ధరనునిశ్చయముగ
దుఃఖభారంబుభరియించి దోగవలసె.

"నాకోర్కె నెరవేరక జెల్లింపకుంటిరి" జోనా. అట్టియదృష్టము పట్టినదికాదు. "నేటైన జెల్లింతువో లేదో యనుసంశయము. బాధించుచున్నది" అయ్యో! సంశయమువలదు. నీముద్దుచెల్లించని మూర్ఖుండని సందేహపడకుము. నిజముగ జెల్లింతును. ముమ్మాటికిని సత్యముగా జెల్లింతును. సన్దేహమువలదు. అక్కటా! ఎంతప్రారబ్ధము తటస్థించెను.

చ॥ సతిసగభాలటంచు జనసంగముపల్కుట వ్యర్థమాయెనో
మతిదలపోయ నెంత యనుమానముజెందితి లోకమందు భూ
పతిసతిలేని గేహమున భార్యయె వానికినెక్కుడౌ కదా?
శ్రుతులను జూచి నీయభిప్రాయము శీఘ్రము నిర్వచింపనొప్పగున్.

"ఎవనిని వెలిసేయుచుంటిని అదేమని నాజీవంబు బాసినతరువాత నెన్నిసారులైనను బెట్టవలయును కాని యొప్పైన నన్నంటరాదు" హా! ఇంకేమున్నది. సుందరివదన చంద్రమండల మస్తమించినది. దానితో నాజీవితములుగూడ నాకర్షించినది. చెలీ! ఎక్కువశోకముచేసి యెక్కువఫలితము రమ్మనినవచ్చునా? "ఎవరేని సాహసించి యుంటివో వారిసంశయము నిర్మూలముగను" సతీ! అట్టి నావారలెవరుందురు? నాచేతిపాకంబై నీవు లేచినావు నాకు వంశాంకురమేది? శ్లో॥ మాతా హతా త్రిభువనం మధురాంగం । తాతా హతా జిహ్వారసాలభిన్నం । భ్రాతా హతా దక్షిణబాహుఖండః । భార్యాహతా ధర్మకపాలచిహ్నం ॥ అనునట్లు భార్యాకోలుతప్పనితో నీకొనందునేమో? అట్లున్నటికెనిరాదు. ఆలకింపనివాడకి దోలిన్నట్టియందలిరుచి మరియెన్నద్దయగునా? అయ్యయ్యో! సుందరీ! ఎంతకష్టము తెచ్చిపెట్టితివి, నీనేర్పు, నీచకచక, నీబిగువు, నీనగవు, నీనీటు, నీగోటు, నీమాటల, నీపాల, నీయాట, నీతేట, నీతెలివి, నీవగ, నీసొగసు, నొక్కపూటతో వ్యర్థమయ్యెకదా?

కట్టా కాలవైపరీత్యము. "ఇట్లువ్రాసితిసని బలవన్మరణము నొందితినని యెంతురేమో?" అక్కటా! నీవంత మూర్ఖురాలవా? "అట్లు జరుగలేదు. జీవస్వాభావికమైన మృతియే సంభవించినది." అయ్యో! చెవుల కాలిన నారసములు గ్రుచ్చినట్లున్నదే? "శిరోబాధయే దీనికిఁ గారణము" అయ్యయ్యో! కార్యముమించకుండ దెలిసినచో దగుజాగ్రత్త పడుదునుగదా? తుదకౌషధసేవలేకయే మృతికిస్వాధీనమైతివా? మన సంస్థానములో నిన్నుబ్రదికింపఁజాలు వైద్యుఁడొకఁడైన లేకుండెనే? "ఒకానొకవేళ జీవములున్న బునర్దర్శనమగుఁగాత" ఇఁకను నాశలగల్పించుచుంటివా? చూచుటమాత్ర మెన్నఁడును జరుగదు. "భవద్విధేయురాలు, కాంతామతి." ఆహా! ఏమి నామమాధుర్యము. ఎంతగ్రోలినను తనివితీరకున్నదే? ఎవరైన భార్యను కరిసిర్బంధమునసుంచి జంపి వగచేప్పు చేప్పునని వెక్కిరింతురు. నాయట్టిపాపులీభూలోకమున బుట్టబోరు. పుట్టినవారింగాలేరు. నేనొక్కఁడనే పాపాత్ముఁడను. (కన్నులను దిలకించి.)

ఉ. శ్రీలకుదావులై కలువ రేకులగల్మినిగ్రిందుసేసి పె
న్మేలకుబంధులై భ్రమర మిత్రములై ఘనఖంజరీట స
న్నీలమనోహరంబులయి నిర్మలసంతతభాష్పవల్లులై
మేలగునీకనుంగవను మించుముదంబునజూడగల్గునే.

హా! సుకుమారి! సుమకోమల కోమలంబగు దేహలతికయెట్లు శుష్కించి పోయినది.

ఉ. రాజగుచంద్రుఁడాశివు శిరంబుననిల్చియు దోషియయ్యె ను
త్తేజమెలర్పనంబరగతింబరతెంచు దినేశ్వరుండు దా
దేజమడంగెడుం బహుగతింధరనెంతటి వారలైన రే
రాజముఖీ! కళంకములిరంబయియుందురు రాజవాచ్యులన్.

నా పాదిగ్యము నన్ను ననుభవింపఁ జేసినది.

వేగ — (మొదః గువారు విచారము సూచింతురు)

విక్ర — సుందరీ! ఇఁక నెక్కడి సుందరి? నా యాశలన్నియు మంట గలపిపోయినది.

చ. జననమె మృత్యుహేతువు నిజంబుగ లోకమునందు భీకరం
బనుచు దలంతు రజ్ఞులు, మహాముదమందుదురు ప్రాజ్ఞు లీవిధం
బును దలపోయ సౌఖ్యముల పొందుగణించుటకంటె మృత్యువే
ఘనమని తోచు జీవులకు గల్గెడి బాధలమాపుచుంటచేఁ.

ఆహా! నీవంటి మనోహరాంగిం గూడ నెన్నిజన్మము లెత్తినను సంభవింపదు, ఇఁక విచారించిన లాభము లేదు. చేయివిడచిన దానికై చింతించుట గతజలసేతుబంధనము. ముందు కార్యంబుల జూడవలెను.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





# కాంతామతి.

## చతుర్థాంకము.

రంగము-సభాభవనము.

(రాజమంత్రిలా ందఱు సభాసదులు—భటులు.)

విక్రి—అమ ్యవరా!

మా. సజ్జనబృందముసౌఖ్యముజెందుచు సంతసమొందు నెసంతతమున్!

మంత్రి—మహారాజా!

ముజ్జగముల్ తమయాజ్ఞను మీరగబోవునెభూతలనాథమణీ!

విక్రి—ప్రధానశేఖరా!

సజ్జనులంగెడివైరులపై నెడబాయకకన్నులనుంపదగున్!

మంత్రి—ప్రభువతంసమా!

రజ్జులుగావునుడీ పరరాజులు రాజ్యములందుననుండిరపో॥

విక్రి—సీ. పులులచే పశుహానిబొంది కాపులుస్రుక్కి

యార్తినొందకనుండ నరయువలయు

ఖలులచే మానినీతిలకంబులకుగీడు

పొరయకుండగ వేగనరయువలయు

బలులచే ననదలు బాధలువడకుండ

దగురీతిగాపాడ దలంపవలయు

న్యాయమన్యాయమున నశించిపోవక
నుండ వీక్షింపుచునుండవలయు
గీ. క్షామచోరాదిబాధలు జనులకెపుడు
కలుగకుండు నుపాయము దలఁపవలయు
నాడనేటికి రామరాజ్య బువోలె
పుడమిజనములు మేలుల బొందవలయు.

మంత్రి—మహాప్రభూ! అవక్రవిక్రమ పరాక్రమరతులగు దేవరవారిశాసనము న్యాయావలంబులకు మల్లెపువ్వుల చెండుగదా? దురాత్ములకు ఫిరంగిగుండుగదా? వైరిహృదయంబులకు నలకుండుగదా? రోగులకు బత్తెమువింటగదా? తమభుజాదండకల్ప శాకయుద్ధులకు చకోరక చంద్రోదయముగదా? దేవా!

ఉ. దేవరపాలనామహిమ దీనులకెల్లను కల్పకంబునై
యీవసుధాతలంబు వసకోసప్రశస్తిని గాంచెనన్న నో
భూవరగొప్పగాదు తగభూతగణంబులెవశ్యులై సదా
గావుమటంచు నిల్చియరికాపులునౌట విచిత్రమయ్యెడున్.
కం. భేతాళుని వశుజేయఁగ
నేతాదృశులకునగాక నితరులవశమే?
భూతలమున పార్థివవర
ఖ్యాతిగ రాజ్యంబునేలు ఘనుఁడవుగానన్

విక్ర—మంత్రీ! నన్నూరక పొగడకుము. మత్పూర్వికుల యదృష్టవశమునఁ నట్లులభించినది.

(ద్వారపాలుఁడు ప్రవేశించి చేతులు జోడించి)

ద్వార—మహాప్రభూ! వింధ్యప్రాంతమునుండి కిరాతుఁడొ

కంను తమ దర్శనమునకై జనుదెంచెను. వానిశరీరమంతయు రక్తము గలదై యుండెను. కడుదీనునివలె గన్పించుచుండెను.

విక్రి—(మంత్రివైపుఁ జూచుచున్నాఁడు)

మంత్రి—త్వరగఁ బ్రవేశపెట్టుము.

ద్వార - చిత్తము (అనినిష్క్రమించి తిరుగ కిరాతునితో బ్రవేశించి, వారే ప్రభువువారు, దర్శింపుము.

కిరా—(సాష్టాంగపడి లేచి)

శా. సామీ సెప్పగవాయిరాదుసుకముల్ సత్తెంబుసల్లారి దే
వా మానెత్తిఁ(?)రాసినాఁడో గురుతింపంరాని కష్టాల మా
నేమంబుల్ పొలముల్ పసూత్కరములుక్ జీవాలపాలయ్యెగా
మేమేరీతిని జీవముల్ నిలుపుగామింతుంగదే దేవరా ? .

దేవా ? మీపాదాలాన, మేము నానావితాలజీవాలతో వేగ లేక దూరానుండి రాలేక పాణాలసిలుపలేకున్నాము.

విక్రి—పులిందా! నివ·యానము వాపుకొనుము.

కిరా—మాారాజా! మామేలు గోరురాజా! సల్లనిమాటాడి వీడ సల్లాగ్చినావు. మాబాములు పగవారికేనివలదు.

విక్రి—నియాపదగల్గెక్కనది, భయపడకుము, వివరింపుము.

(లోనకలకలమువిని మంత్రివైపు చూచుచున్నాఁడు)

మంత్రి—ఎవఁడురా అక్కడ.

ద్వార—(ప్రవేశించి) దేవా ! ఏమిసెలవు.

మంత్రి—ఆకలకలము విచారించిరమ్ము.

ద్వార—(నిష్క్రమించి తిరిగి ప్రవేశించి) దేవా ! వింధ్యపర్వ ప్రాంతపు కిరాతుఁడట. తమ దర్శనమునకై వచ్చి తొందరపడు చున్నాడు.

విక్రి—(మంత్రివైపు చూచుచున్నాఁడు)

మంత్రి—ల్వారిఁగఁ బ్రవేశ పెట్టుము.

ద్వారి—(వెళ్లి కాలునకు కట్లుకట్టుకొని నుంటుచున్న కిరాతునితో బ్రవేశించి) వారే ప్రభువువారు.

కిరా—(సాష్టాంగపడఁబోయి పడలేక చేతులు జోడించి)దొరా! బొబ్బలపులిగము నాకాలుపికినది. ప్రాణాలు గుడగుడలాడుచున్నవి. బాదబాద, సెప్పలేను.

విక్రి—నీబాధ నేటితో వారించిపది భయపడకుము.

కిరా—ఏమీ పుణ్యమో సామీ! కాంతారమ్మ దగ్గఱుంటచే ప్రాణ మాగినది. మాగూడెపువారందఱు పులిచేతబడి యీల్గినారు కొందరి గాయాలు సెప్పరాదు.

(లోపల కలకలము)

విక్రి—మంత్రీ! వారినందఱిని రప్పింపుము.

మంత్రి—మహాప్రసాదము. ఎవరక్కడ.

ద్వారి—(ప్రవేశించి) దేవా! ఏమిసెలవు.

మంత్రి—ద్వారమునొద్దనున్న యూరదల నందఱిని బ్రవేశ పెట్టుము

ద్వారి—దేవరయాజ్ఞ (నిష్క్రమించి పలువిధముల కట్లుపట్లు కలశరీరములుగల ఇరువురు కిరాతులతో, బ్రవేశించి వారే మహారాజుగారు.

కిరా—మాపాళెములో జడల మెకాలను సూసి బీతుకుడిసి యీడకురాని వేటిసింగాలు బాబూ! (అనిమూర్ఛబోవును.)

విక్రి—అయ్యో! ఎంతకష్టము. సింహాసనమునఁదలి సింహా

ములంగాంచి యడవిలోని నిజమునైన పెడదమోము మెకములని వె
రచి మూర్ఛనందినారు. (లేక్కిన వారింజూచి) వానిని ప్రబోధింపుచు

చ-కి—ఏమిపబువుసామీ! సచ్చి మీసేరువకురా మాజీవా
లూడ్చు జీవాలనిల్పితివి దొరా!

రా-మం—(మొదలైనవారు వారియవివేకమునకు నవ్వుదురు)

ద్వి-కి—(చ-కిరాతునితో) ఇంకేమిరాజురా. మన బొముల
సూడనివాడు.•

చ-కి—అదేటికూత. బుద్దిమళ్లించుకో. మారాజువింటే కోన
లో పానాలూడడమున్న. ఈడనిజము.

ప్ర-కి—(ద్వితీయునితో) ఓరి! పెట్టి! బొమ్మలుగాని వానికె పాన
ములేదు భయములేదు లేలే.

తృ—కి—(మూర్ఛనుండిలేచి) ఓగబ్బా! గుల్లి లిమిసూస్తుం
దగా? బొమ్మలుకావురా బాబూ! సింబోతు సేవసూస్తిగాని ఇంత
బయపెట్టలేదు. (వణకుచున్నాడు)

విక్ర—(వారి యనాగరికతకు నవ్వుచు) ఓరీ! సీకేమియు భీతి
లేదు కిరాతులారా! మీబన్నెబుల నుడువుడు.

ప్ర—కి—సెప్పడమునకేమున్నది సామీ! మమ్మేలినవాడా!
పులులెగబడినవి. పందులు మ దలు మందలై పొలాలవెంట బడినవి.
అవెక్కడవోకాని నడగొండలవలె తరుముబోయిన తిరుగబడును.

ద్వి—కి—ఇల్లాలుముద్దుగా సూసిన ఆబెయ్యను చియ్యబట్టి
దుంయిమని యొకంగను నోటగవ్వుకొని చివ్వున సారలమెకమెత్తుకొని
పోయినది.

విక్ర—అయ్యయో! ఎంతకష్టము.

తృ—కి—అవేమి జంతువులో కాని నేలయీని నక్లేతగన్న నూడ వచ్చును. మందుబీతి ముందేలేదు. గందుగదా రెండేవుకూనల నొక సివంగి నిమేసములో పేగుల పోగులవలె నూడలాగినది.

విక్రి—అమాత్యా! పూర్వము విశ్వామిత్రి సృష్టివలె నేనుద్భవించలేగుగదా? వీరిమాటలు కనువిచిత్రములుగ నున్నవి.

చ—కి—దేవా! మీపాదాలతోడు. అలద్దమాడిన మాజిమ్మడినట్టే

విక్రి—నేనువచ్చి జంతువులజంపి మిమ్ము రక్షించెదను.

ప్రి—కి—ఎల్లిగాక నుస్సీ నేనేవు తేడా!

ద్వి—కి—ఓరి! బాబుగారంటె కాని లొంపముస్గదా?

తృ—కి—బాబుదగ్గఱ బయమేటిరా?

చ—కి—ఓరి! తెందనాల జడదారులుంటేరా మనకు.

ప్రి—కి—ఓరి! ఊరంగుగా బాబయసెప్పేను.

విక్రి—ఓరి కిరాతులార! మిమ్ములు రక్షించి యాపదల ప్రోదోలుటకే బద్ధకంకణుడనైతిని. వగవకుడు.

తృ—కి—(తనలో) నీసులవోలె నోరీయుంటారు. మాగూడెం లో "ద్వారా" అనకపోతే బుట్టెగరెస్తా. ఇదేంగతి. ఈబ్లొపాళెంగోప్పోగొట్టారు. (మఱియొకని చెవిలో చెప్పుచున్నాఁడు)

చ—కి—(తిరిగి యూరకుండుమని సౌజ్ఞ చేయుచున్నాఁడు)

ద్వి—కి—(తనలో) బద్ధకంకణమేటి? నేతికి కంకణంగాని. బద్ధకు కంకణంగడతారా. (అనితన అభిప్రాయము తృతీయునితో చెప్పును)

తృ—కి—(ద్వితీయునితో) ఓరి నీఅమాయకంకోల. ఉండల బద్దకు తాకుండదంటారి అదే కడతాడోసి.

ప్రి—కి—మూపానాల మీాసేతికిచ్చి నమ్మితిమిసామీా! మీాసి
త్తము. మాభాగ్యము.

విక్రి—మీాకాసందేహ మక్కరలేదు. మీారందఱు నిందేవిశ్రి
మింపుడు. మీాకు వలయు సదుపాయములను జేయించెదను.

గీ. ప్రజల బాగోగులరయని పార్థివుండు
గాత్మభూషలదాల్చెడి రాజవరుఁడు
గంగిరెద్దునుబోలు చుక్కాతలముస
వ్యర్థజీవులు గాకపో యరయ నెందు.

ప్రి—(ద్వితీయునితో) ఓరి! బాబుగారిసిస్త్రము మెత్తన నూసి
తివా? మఁ బాదలు నూడలేక వెంబడించినాము. ఇఁక గుట్టలుగుట్టలుగా
మాంసము మెక్కి లొట్టలు వేయుచు లొట్టెలునిండ జీలుగుకల్లుంచుకొని
ఆ తిరగాల సే ందరా! నా సామిరంగా.

త్ర—(చ-కి-తో) ఒరి! నాపెట్ట నీళ్లోసుకుని సారిలమెకము
మాంసము సకినూడనేడిన డ దాసిమను దీరినట్లే.

ద్వి-కి—(ప్ర—క—తో) నా సేస్త్రకాదు బాపనయ్య కాలునొప్పి
కి పులిసముదుగొరి మతిమతి సడినాఁడు అప్పుడోదుగలము. అప్పుడో
సనలము. సద్ది ఎప్పుడిచ్చితే అప్పుడేపుచ్చుకొని నరువుకాపాడెను. ఇఁక
పిల్లలతో నప్పగించగలను.

చ—(త్ర-కి-తో) పులిగోళ్లు నెమ్మాయి బాదకు విరుగుడని సం
కలోగోళ్లు రొంమచఁ నది చితెమ్మని ఒకమ్మ సెప్పినది. నేను గోరుకు
రొంమవరాలంటే ఇల్లులన్నది. నాల్గనరాలు సేతిక వచ్చినట్టే.

ప్రి—నేను పందిగున్నల గురు గుచ్చెదరా?

ద్వి—సిరతల గొంగతవేసెదరా?

తృ—దున్నలకాల దున్నెదరా?

చ—మన్నులమన్ను సేసెదరా?

ప్ర—కణుసులకశువు సించెదరా!

ద్వి—గోరల మురలించెడరా?

తృ—కరుల వరిమెదరా?

విక్ర—ఓకిరాతులారా! బడలిక దీర్చుకొనబోంము. నేటికికొలువు చాలింతము. (తనలో) హామనోహారీ! పవమానసూనుని శరీరమునందు వ్యాపించిన శ్రీరామాంకమువలె నెంతకాలమైనను నాహృదయమును మాత్రము బాయజాలవుసుమా! నీకు కృతఘ్నుని యందలి యుపకారమువోలె నాయందు ప్రేమలేకపోయెను. హా! ఎట్టిగతి.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.

---



# కాంతామతి



పంచమాంకము.



రంగము—అడవి.

(విక్రమార్కుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విక్ర—ఆహా! ఆమాయలేడి నన్నెంతదూర మీడ్చి తెచ్చినది

గీ. పవనవేగంబు బాణజవంబు సూర్య
రథతురంగ మంబులసత్వరంబు హృదయ
శీఘ్రమీ హరిణమునకు జెందఁబోలు
గాక యుండినదృగ్వీథి గడచు టెట్లు

ఏమి యీవనరామణీయకము.

సీ. ఇంద్రాయుధద్యుతులిందు గన్పడువింత
నట్టువపుల్గుల నాట్యవేళ
కలశపాథోరాశి పొలుపువహించెడు
కలహంసలవిహార కలనవేళ
గాఢాంధతమసంబు గలిగించు గుహలు నా
యారముల్ గడుపగలింటివేళ
వటశాఖపై నిల్చి భ్రమగొల్పుశుకములు
గాంచ ముదంబును పెంచువేళ.

గీ॥ పువ్వువల్లులు స్వీయపుష్పాళినిజల్లి
నేత్రపర్వంబొనర్చెను జిత్రవికార
వనరమాకాంత శృంగారమును నుతింప
దరమె వేయిజిహ్వలదాల్చు నురగపతికి.

పచ్చని మొలకలు రత్నకంబళము పరచినట్లల్లారు ముద్దుగానుండెను. వికృతిచేష్టలొనర్చుచు వానరసముదయంబు చెట్లపై నుఱుకుచున్నవి. ఈపువ్వుటేరము సొగసేమని పొగడుదును. ఏమి యీమాకందముచందము. ఆగంధము తుమ్మెద ఝుంకారము. ఆసెలయేటియొడ్డున గూర్చుండిన హరిణము లేచివచ్చునట్లున్నది (అనిపరిక్రమించుచు) హా! కరిణీయాన! ఇట్టివింత నీకుంగూడ గనుబరచిన నెంత సంతోషింతువో కదా? నాకట్టిభాగ్య మెన్నిదినములకు సంభవించును. (అని సెలయేటియొడ్డున గూర్చుండును.)

కాంతా — (ప్రవేశించి తనలో) ఇక్కడ నేదియొధ్వని గలుగుచున్నది చెపుమా! ఇందెవ్వరుకలరు? ఈపొదరింటిలోని యిందు శిలావేదికపై వీణియనుంచి వచ్చితిని మున్నాఁడు డీ కాననమునకు బలుమారు మృగయావినోదార్థ మరుగుదెంచుట నాకెఱుకయని విని యిందు నివసించితిని. ఎప్పటికైన నాకోర్కె ఫలించునా? (అని పరిక్రమించుచు విక్రమార్కుని జూచి) ఆఁ! ఏమి? నాపూర్వపుణ్య ఫలితము. నాకనులకానందసంధాయకుఁడగు నాహృదయేశ్వరుఁడే యీయన. దైవేచ్ఛ యెట్లుండునో తెలియదు. ఒకవేళ నాపంతమీడేరు కాలము సమీపించినదేమో? ఎట్లీయన నాకు వశ్యుఁడగును? (ఆలోచించి) "శిశుర్వేత్తి పశుర్వేత్తి, వేత్తిగానరసంఫణిః" అనునట్లు సర్వజీవులకు సంగీతమే మోహకరము. కావున మోహనరాగాలాపంబునకు మోహించి

వెంటబడు సారంగంబువోలె నీనృపకుంజరుని సంగీతమునుబాడియే రప్పిం
చుకొనెదను (అని పొదరింటఁ బ్రవేశించి వీణపైఁ గొన్ని గీతములను
బాడుచున్నది.)

విక్రి—(వినుట అభినయించి) ఎక్కడనో సంగీతము వినఁబడు
చున్నది. అరసెదనుగాక. (అని లేచి పరిక్రమించుచుఁ గాంతామతిని
జూచి) ఈపొదరింట నెవతెయో మందయాన కన్పడుచున్నది. నేనొక
కవినైనచో బ్రత్యవయవమునకు వేలకొలఁది పద్యభూషణము లిడి
యుందుఁగా.

ఉ॥ కంతునిబాసిపంతమున గానజడించు రతీవరాంగియో
సంతతముస్వారిన్విడచి సంచరణంబొనరించునట్టి శ్రీ
కాంతయొ? వేడ్కమైభువన గణ్యవినోదవిశేషదర్శన
స్వాంతమున న్విహారమిట సల్పెడుశంకరు ముద్దుగుమ్మయో?

ఉ॥ కన్నులగోల్వబోయి కరకంజములెత్తి విధాతృఁడుంచి దా
గ్రన్నవతీయుచో రేకొకటి రమ్యతనందున నిల్చునట్టు లీ
యన్నులమిన్నకన్నగవ యద్దిర! చేరలమించెమించె సం
పన్నతశ్రీరుచిఁ విమలపంకజసంతతి వింతవింతగన్

ఎట్లుపల్కరించు తెఱవు? నీవు క్షేమంబుగనుంటివా! యందునా
ముఖపరిచయమైనలేదే. కాదుకాదు. దాహమని యడిగెదను. ఏమను
టకు దోచకున్నది (మదనబాధ సూచించుచు)

గీ. విల్లునమ్ములుదాల్చు నేవీరుఁడేని
యెదుటనిల్చి యుద్ధమొనర్చునింతె కాని
నిన్నుబోలుచుచాటున నిల్చిశరము
వైచిబాధింపడిది యేటుపౌరుషంబు

కాంతా—(తనలో) నన్ను వంగివంగి చూడ ప్రారంభించెను
మదనదేవుండించు కదయజూచినట్లున్నది. ఎట్టీయనను నాకడకురప్పించు

కొందును. సాధనము గాన్పింపకున్నదే. వినవిట్లు చేసిచూచెదను (భ్రి మరబాధ నభినయించుచు పైకి) అయ్యయో! దుష్టమధుకరమా! యువదల బాధించినగాని నీపౌరుషము వెల్లడికాదా?

విక్రి—(తనలో) «రోగిపాలు గోరవైద్యుండు పాలుద్రావు] మనునట్లుకాక తాళీయముగ దరిజేరుసమయము సమీపించినది [ప్రకా, ఆ! దురాత్మా! ఆగుమాగుము. (అని సమీపించుచున్నాడు)

కాంతా—(లేచి నిలుచును)

విక్రి—సుందరీ! ఆదుష్టుండెటుజనెను?

కాంతా—మహాత్మా! నీ ధనుర్బాణములనుగాంచి మనంబున భ్రమించి యెందోజనెను.

విక్రి—రోలంబాలకా! నీవెవతవు?

కాంతా—ఒంటిపాటునం గంటబడిన మదవతిని బల్కరింపుదు నెపమాయిది.

విక్రి—(తనలో) ఇది నాయభిప్రాయమును జక్కగ గ్రహించినది. మంచిజాణ. ఎటులదీనిని లోబరచుకొనుట, (ప్రకా) హరిణాక్షీ! హరిణము వెంటబడి దారి తెలియక తత్తరించునాకు పురముజేరు దారింజూపి పుణ్యంబునందుము.

కాంతా— మానవనాయకా! దానియడుగుల జాడనుబట్టి వెళ్ళుము.

విక్రి—వెళ్ళిన మండలంబును జేరుదునా?

కాంతా—అచటి రాజునునిర్జించిన జేరవచ్చును.

విక్రి—జయించుట కుపాయము.

కాంతా—ఉపాయములేకున్న నపాయము సంభవించునుగదా?

విక్రి—దానికి నిన్నడ్డువెట్టరాదా? సుదతీ!

కాంతా—నన్నడ్డువెట్టుట కెట్టివాండు కావలయును.

విక్రి—దానికి నేతగనా?

కాంతా—(ఇంచుక కోపముతో) చాలుచాలు

విక్రి—పద్మనేత్రి.

చ॥ పదములుగందు వారవనవాసము జేయుచు నొంటినుండనీ
హృదయము భీతిజెందదొకో? యెన్నగగానన మిందుపూర స
త్వదళము మందముందలుగ వాసమొనర్పు వసింపరాదుగా నా
సదనమునందునిల్చి సుఖసంపదలందు ముకౌతుకంబునన్

గీ॥ ఒంటిపాటున కాపురిముండ నేల
జవ్వనంబెల్ల వ్యర్థగాక నివ్వనమున
మరుండుఱ్ఱారుండు వలవైచిమానసంబు
నిడ్వనాగె నీవడ్డవే యిందువదన! (ప్రక్కకు జేరును)

కాంతా—(తనలో) వలబడ్డమృగము వేట కాని పాలయినట్లు
మాంపాశమధ్ధుండగు నీనృపశేఖరుండు నాపాలంబడినాండు. (పైకి) ఓ
యీా నీవెవరవు? సంతోషంబున విహరించుననుఁ బోటిబోటుల బల్కా-
రించి త్వరేలన భంగంబొనరింపదగునా? దయచేయుడు.

విక్రి—లతాంగీ! ఏమువిక్రమార్కమహీశుండను నీదాసుండను.

కాంతా—రాజా అట్లుగానలగు నాదాసుండనైన నేమిఫలము

విక్రి—పల్లవపాణీ!

ఉ. తావకనేత్రి శౌజ్ఞలు సదామదిజ్ఞానము లెంచుటొండు సం
భావనతోడ కౌంగిటను వాసముజేయుట రెండువేడ్క కె
మ్మోవినుధారసంబును బ్రిమోదమునన్ రుచిజూడమూడునై
భావజకేళిగూడి యుపవర్గసుఖంబులుల నొందనాల్గగు
ఇంక నెన్నియో లాభములు కలవు.

కాంతా—(తనలో) ఇన్నిదినంబులకు నాతపంబు ఫలించినది.
వీనులీసుధాప్రవర్షంబున నోలలాడుట కెట్టిపుణ్యంబును జేసికొనినవి?

(ప్రికా) నృపా! చాలుచాలు. నీమాటలగట్టిపెట్టి నీదారినిబొమ్ము.

విక్రి—పికవాణీ!

| | |
|---|---|
| చిత్రిపద | దారినిజూపవె వేగం ♦ గోరితి నిన్నవగావం |
| | గ్యారమరుండదయుండై ♦ ఘోరశరంబుల నాటెన్ |
| కాంతా | నారిని గాంచినతోడం ♦ గోరుట ధర్మమెనీకున్నీ |
| | భూరమణుండని గర్వం ♦ బారయ జెందగమేలే |
| విక్ర | చానరో! వేడెద |
| కాంతా | చాల్ చాల్ |
| విక్ర | దీనునిగావవె |
| కాంతా | మేల్ మేల్ |
| విక్ర | మానిని దానములందుక |
| కాంతా | బూను నిదానమెబాగా |

రాజా! తమవంటి ప్రిభువతంసులు నాబోటి నీచకాంతను గోర మేర కాదు.

విక్రి—పుండరీకవదనా!

ఉ. నీచమనంగ నెద్దితరుణీ! ఘనవారిధరంబు వేణిగా
గాంచముచెక్కుగా నదుముకంథర మార్గముగా సుధాంశుఁడుక
నీచవుబానిసీఁడుగ ననిందితహేమవిశేష కాంతిమై
దోచెడుశోభగా వెలయు దొయ్యాలి నీచనదోయి నీచమా?

శ్రీవృత్తము— రా। జీ। వా। క్షీ।

సుకాంతివృత్తము— దయావతీ! భయాత్ముఁడన్ వయంబునన్ దయంగనన్

వృత్తము— ఓరామా గారింపన సారంబా బీరంబా

వసుమతివృత్తము— తగునా సుదతీ! పగవాఁడనెనీ బిగికౌఁగిట నన్ దగజేర్పగదే

కాంతా—(తనలో) హృదయమా పొంగకుము. (ప్రకా)
స్త్రీవృత్తము. నారిం గోరం జీరం మేరా
వృత్తము—నృపకులతిలకా కపటపుపలుకుల్ తగిపగొనిపలుకం
గపటము వెలియా
మానిని—మానుము మామును మానవనాయక! మానిని
తో గవగూడుతలం
విక్ర—పోసలినాక్షిరో! దుష్టమరుండిటు లుజ్వలగాణము
నాటెనెదన్
కాంతా— సూనశరుండెద నాటినసృక్కుచు సోలెదవోబల
మేడజనెన్
విక్ర— పీంపయోధర! నీమరుజొచ్చితి పేర్మినునుంపవె
బాహులతన్

ఎంతవేడిన నీకింతయేని దయవొడమకున్నయది. నన్నేలిపట్ట మ హింపివై నా రాజ్యంబు సర్వంబునీవ బాలింపుము. ఇంక వెతలముంపకుము

కాంతా—(తనలో) ఏమినాయదృష్టము. భూచక్రం బవక్రవి క్రమంబున నేలు నృపపురందరుఁడు నన్నేలుకొనుమని వేడుచున్నాడు, అతనిజాయననగు నాకింతకన్న భాగ్యంబేమికలదు. ఇప్పటికి నన్నెఱుఁగ కున్నయది. కొంతబిగువుచేసి వినోదించెదను. ఓధైర్యమా! కొంత కాలము నీప్రభావము నాయందునిల్పుము ఓక్రీడాదేవతా నిన్నెవరు పిలిచినారు. నాహృదయ ప్రాసాదమును ముట్టడించుటకు నీకేమియధి కారమున్నది? చాలుచాలు. నీకుపదివేల వందనములు. ఓహృదయమా విరోధులవశియయ్యెదవా? అట్లుగాకుము. నాపక్షమునవిల్చి వైరులనెది రింపుము, (ప్రకా) పార్థివకుంజరా!

గీ॥ న్యాయమార్గానధరనేలు నవనిపాల
కాంతనుంగాంచినంతనె కలయవశమె

కాంతా— రాజబిడౌజా!

చ॥ ఒరునిసుధీనతన్ నిలిచియుండిన కాంతను కామకేళికిన్
సరగున బిల్వగా నగునె చాలునుచాలును బిల్వబల్కగా
సరసము మీకు వచ్చె మదిజాలి వహించెను నావిభుండు స
త్వరముగ నేగు మాపెదవిదాటినం బృథ్వియు దాటెనుజుమీ

విక్రి —(తనలో)

గీ॥ సతికనిష్టంబుగా నట్టిసరణియేని
చిరునగవుతోడ బ్రత్యుక్తి చెప్పనేల
స్త్రీలచిత్తంబు దెలియంగ శేషునకును
వశముగాదన్న నాకెట్లు వశము తెలియ

ఉ॥ పగొప్పదకొంగుజార్చు ప్రతిభాషలనాడెడు బాహుమూలముం
జయ్యనగానుపి పగను జారుపయంటను జక్కదిద్దులో
నెయ్యముబూపుచూపురను నిర్మలరాగము కల్గియుండకే
తొయ్యలియున్నిపోకడలతో చదుపోవగ నాకుజూడగన్

ఉ॥ కోపను లేదుమాటలను కూలముచూపుప్రశాంతి మోహమున్
జూపెను చేష్టక్రీడ బహుసుందరియియ్యది నాతపఃఫలం
బీపడతింగనంబరచెనే క్రియదీనినిగూడు వాడనో
తాపము మీఱంజూచెనుగదా సుమబాణశరాగ్ని పెంపునన్

(ప్రకాశముగా) సఖియా!

క॥ వెలయాలనంచు బల్కెదు
వెలయింతిని దెల్పరాదె వెలనిడికొందున్
తులలేను నీయొయ్యారము
తిలకింపక రెంటుకనులు దీరవురమణీ

కాంతా— రాజా! వెలయాలి పొందుగణించుట గౌరవమునకు

భంగకరము వెలయాలికిఁ బ్రేమ లేదనువాక్యము విూఱుటంగనిది కాదు,

విక్రి—సుందరీ! అట్లనకుము.

సీ॥ కిన్న రేశ్వరసుతుండెన్నఁగ రంభతో
మేనకనుగలయఁగ దగ్గనే గౌరవంబు
గాధేయుఁడా (దేవకాంతను) గూడంగ
మునులలో విఖ్యాతి బోయెనొక్కొ
పురుకుత్సుఁడూర్వ శీభోగంబుగాంచిన
సార్వభౌమత్వంబు జరుగలేదొ
స్వర్వేశ్యతోఁగూడు పరమతపస్వియౌ
మాండకల్లిముహి ముమాసెనొక్కొ
గీ॥ మహినినంతటి ఘనులె పోమదవతులకు
జిక్కి జొక్కిర నపరులలెక్క యేల
యేలకుండుట నాయమా యోలతాంగి
అర్థియననాస్తియనుట మహాగుణఁబె

నాకైదయురాదు. గానినాడు నాకీరాజ్యముతోఁ బనేమి ఇంద్ర వ్రతినై యుండెదను. అందునను.

సీ॥ ఘనసారకలితమా గంధంపుబూతె యె
బొదలెదుభసితంపు పూతగాఁగ.
నవరత్నమండిత నవ్యదుకూలంబు
వరలెదువల్కలాంబరముగాఁగ
నురుముత్తియపుపేరు మరువకజపియించు
రుద్రాక్షమాలికా రూఢిగాఁగ
తావకాపాంగ వీక్షావినోదకరసం
తృప్తియె భ్రూమధ్యదృష్టిగాక

గీ॥ వెలయువనుగాగ మాలికల్ విస్తరిల్ల
సరియకుండినజీవంబు వ్యర్థముసుమ
ముఖవిజితశారదా పూర్ణపూర్ణిమాని
శాకరమనోజ్ఞ విలసితచారుబింబ

కాంతా—(తనలో) ఏమి నాయదృష్టము సకలనృపకోటి కోటీరరత్నమండిత పాదనఖాంకుడును. దేవీపరిణయ సంపాదిత పూజ్య సింహాసనాధిష్ఠితుండగు మన్మనోహరుండు నత్యాతుండైనను ననుకంపజూపుమని వేడికొను భాగ్యముకన్న మిన్నగలదే? ఇంకను బిగువుచేసినచో సరసమునుమదిరెలిగసమగు చే మోహమునుభీతియు బొడముచున్నయది లలనలకు పెండంబున పరపురుషానయము కలిగినచో దానిని మరలింప నెవరికి సాధ్యము కాదు. అందుచేతనే జీవితేశ్వరునకు నాతనకు తానై కన్పడునటనిల్చి పలువిధములు బ్రార్థించునప్పుడు నత్తమునకు మోతల లోనగ ణ నిశ్చలత్వమూని యుండనేర్చునా? ఇప్పటికే రోమాంచాది యవస్థావిశేషముల గుర్తించియే యుంటిను అక్కటా! ఇది యేమి యవస్థ! ఎక్కడినుండియో యీపాడుసిగ్గువచ్చి నన్నావరించుచున్నది ఓర్వలేక మాటలాడలేకపోవుచుంటినా? నన్నని కప్పగించుటకు మొట్టమొదట దినపూర్వభాగ జనిత ఛాయావిధంబున నుండు, నిడాబిళముగా జూచి మోసపోయి లేనిపోని యలజడికి లోబడితిని ఎప్పటికి క్రొత్తకానవలెనను గాంతా జనోచితంబగు క్రీడయెరక్షణీయము. విసిసంతోషములో లోనగి పోయిన గౌరవముండునా? కావున కొంతకొంత యవకాశము కల్పించుచు మనసిచ్చియు నీయనట్లు ప్రవర్తింపవలయును. (ప్రకా) మదవతీమదనా! పురుషులు తమయుక్కురతీరని నిగ్రహతముగ్ధలను పలుబాముల నొందింతురు మొదటనే వారిచెలిమి యంగీకరింపకుండుట శ్రేయస్కరము.

సీ. నిర్వ్యాజప్రేమిడి నెరపుశకుంతల
దుష్యంతుచేఁ గడుదుఃఖపడదె
పతికష్టపడుచుండ వనికేగదమయంతి
కోకను దగఁగోసి కొనఁడె నలుఁడు
సాహసి బుధాంబుబాధల కష్టపెంచును
సతినమ్మఁడే హరిశ్చంద్రనృపుఁడు
భంగానభంగంబు సతినొంద గాంచియు
సమయంబు కాదని శమనసుతుఁడు

గీ॥ కాన నెవ్వరు పూర్వోండ్ల కష్టసుఖము
లరయఁ బాపంబునన గోరు ధరణినాథ!
యేల మిథ్యాప్రియమ్మంబు లిపుడు చేయ
నేలనా బంధనాంత్యకరచుట వలదు వలదు.

విక్రమ—(తనలో) ఏమి! దీని వాక్యమాధుర్యము అర్థగాంభీర్యము కల్పనాచమత్కారము. మహాపతివ్రతలచారిత్రములనుదువుచున్న యదెంతనయింతమున వారియంతరమును నరయుచున్నది. దీనివాకచక్యము మద్గ్రంథోపకే నున్నది నూరుగురు కన్యకులైన పూర్వముల్కల బరపి దేందాబు చిదరపాదబు చేయుచున్నారు. మాటలధోరణి కొంత యువకాని మొన గునున్నది. ఐననిట్లనెదను. (ప్రకా) చెలీ!

ఉ॥ కాలంబుదాటనీదయి కష్టపరింపగ జెందువేళ స
చ్ఛీలవతుల్ తమంతనెక్కృశింతురు నాధులటంచు నెంతయుం
దాలిమినిల్పలేక కష్టధైర్యముబూని జరించిరంతె కా
కోలలనామణీ విభులుకొందరఁ జేసిరె గారిచాములన్

కాంతా—కొలఁదిదివసంబులె నీకైవసమందుండి యెడబాయు నావలన ఫలమేమున్నది? కలకాలము సుఖించినగదా సంతోషము.

విక్ర—అచిర కాలమైనను జన్మము తరించెనుగదా?

కాంతా—(చిరునగవుతో) నాకోర్కెయును దీరినఁగదా మీకోరిక తీరుట.

విక్ర—అడుగుమిచ్చెదను.

కాంతా—నీముద్దుటుంగరము గట్టియిమ్ము.

విక్ర—ఎంత వెఱ్ఱిదానవే. ముద్దుటుంగరమునా కోరెదవు. నా రాజ్యంబంతయు నీస్వాధీనంబు చేసిన యుక్తానుసారము మెలంగువాఁడనుగదా. (ముద్దుటుంగరము కట్టియునిచ్చి) సఖీ నీముద్దుకోరిక దీరెకదా? నాకొకముద్దిమ్ము, (చెక్కిలి ముంబనము చేయఁబోవును)

కాంతా—(సిగ్గుతోఁ జేయి యడ్డమునుంచును)

విక్ర—(రెండవ చెక్కిలి ముద్దిడి) ఏమినాఁటస్మద్ధన్యత.

కాంతా—(తనలో) ఇప్పటికిఁగదా నాపుణ్యము [illegible]. (ప్రకా) నాథా! నన్నిట సిగ్గుపరపకుము

విక్ర—సుందరీ! ఆలతాకుఁ జముఁక పితౄమింతమూరము.

(చేయిచేయి పట్టుకొని నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.





# కాంతామతి

## షష్ఠాంకము.

రంగము—రాజసభ.

(విక్రమార్కుండు, పరివారము, కుమారునితో కాంతామతి ప్రవేశించుచున్నారు)

విక్ర—ఓసీ! నీవు చెప్పుకొనవలసిన దేదియో చెప్పుకొనుము.

కాంతా—తామొక రాచకన్యను వివాహమాడుటయు, దాని నొక కారణంబున బంధనాగారంబున నుంచుటయు, అదియందే మరణించుటయు తమరు విస్మృతి నొందలేదుకదా?

విక్ర—ఔను

కాంతా—ఆ చనిపోయినను కాంతినుదలంచి నాముఖము నొకసారి గాంచుడు. అప్పుడు నేనెవతెనో తమకు తెలియగలదు. (అని మేలిముసుంగుతీసిముఖము రాజునకు గనుపరచుచున్నది.)

విక్ర—చూచితిని.

కాంతా—దానిలక్షణంబు లెల్లయు నా యాననంబున దోచినవా?

విక్ర—చనిపోయినదాని లక్షణంబులు నీముఖమున గనబడిన తమాత్రమున లాభమేమి? మనుష్యులనుబోలు మనుష్యులుండరా? నీవు నాభార్యనని యెట్లు రుజువు చేయుదువు

కాంతా—దానికేమిలెండు. అది చనిపోవునపుడొక కమ్మ వ్రాసియుంచెనే దానిని మీరు చూచుకొంటిరా?

విక్రి—చూచిన.

కాంతా—అందలి చివరవాక్యముల నొకసారి స్మరించెదగా?

విక్రి—స్మరించిన

కాంతా—తిరిగియొకసారి చదువగోరెదను

విక్రి—(మంత్రివైపు చూచుచున్నాడు)

కాంతా—ఆగుము

విక్రి—ఏమి?

మంత్రి—తన జేబునుండి కాగితముతీసి చదువుచున్నాడు!

కాంతా—ఆవాక్యము తిరిగిచదువుము.

మంత్రి—"నాజీవంబు బాసినతర్వాత నెటులున్న నట్లే చితిని బెట్టవలయును గాని యొకరైన నంటరాదు,,

కాంతా—దేవా! ఇందలి యర్థమేమని యూహించితిరి?

విక్రి—ఏమున్నది. శవమెట్లున్న నట్లేయుంచుమని.

కాంతా—ఇందేదేని కపటముండవచ్చునని యిపుడు మీ చిత్తంబునకు దోచినదా?

విక్రి—స్మృతి తప్పినప్పుడట్లు వ్రాయరాదా?

కాంతా—పోనిండు, తర్వాతనేమున్నదో?

మంత్రి—"ఇట్లు వ్రాసితినని బలవన్మరణము నందితినని యెంతురేమో?

కాంతా—దీనికేమనెదరు.

విక్రి—జంతుస్వాభావిక మరణమని తెల్పుచున్నది,

కాంతా—పైననేమున్నదో?

మంత్రి—"జీవమున్నచో బునర్దర్శన మగునుగాత.,,

కాంతా—ఇప్పుడేమనెదరు.

విక్రి—"బ్రతికియుండిన తిరిగిచూడవచ్చు,,నని దానియభిప్రాయము.

కాంతా—దీనివలన దానిమ్మృతికపటమని తెలియుటలేదా?

విక్రి—ఔను అట్లేయనుకొంచను. నీవునాజాయ యెట్లగుదువు

కాంతా—నాథా ఆకపటవు మృతినందినదానను నేననిమనవి చేయుచున్నాను

విక్రి—అట్లు మాయలుబన్నినందున నీకువచ్చినలాభ మేమి?

కాంతా—నాథా! వెనుక నాయుద్యానవనమునందు నేను విహరించుచుండగా తా మొకనాటి మధ్యాహ్నము నన్ను దాహ మడుగలేదా?

విక్రి—నా కేమిజ్ఞాపకము. అనేక దేశములను తిరిగితిని

కాంతా—అక్కడమి మ్మొకరు చక్కనస్త్రీ పేర్కొన చేయలేదా?

విక్రి—(తనలో) "ఆడుది బొంకినగోడ బెట్టునట్లును, మగవాడు బొంకిన దడికట్టునట్టు,,ననుసామెత దీనియందు సార్థకమగుచున్నది ఎంతలోతునకు దిగ్గుచున్నది. ఇకను దీనిబుద్ధివిశేషముపరీక్షించెదను నాకేమియు జ్ఞాపకములేదు. (ప్రకాశముగా)

కాంతా—ఔను తమకు స్మరణరాకపోవచ్చును. దానిని వివరింప ననుజ్ఞ దయచేయుడు.

విక్రి—మొదట నేచెప్పకొంటినిగదా?

కాంతా— చ,, "అతిథి......నంతకున్,, అనిమీరంటిరి.

విక్రి—ఇట్లనుట నాకునేడు స్ఫురించినది.

కాంతా— నేనును దానికి

గీ॥ విన్న......నెమ్మనమున,, అనిజవాబిచ్చితిని.

విక్రి—ఔను.

కాంతా—తత్ప్రతిజ్ఞాఫలమే యీకుమారుఁడు భవాత్మజుండు.

విక్రి—జౌనే; ఎంతటిమాయ పన్నితివి.అయ్యది మరణించిన నీవేదియో మోసంబున నాజాయనని నమ్మింపఁజూచెదవా?

కాంతా—ప్రభూత్తంసమా! పోనిండు చెఱసాల గాయనియు
ఉంచిన భటులనిందు పిలిపించెదరా?

విక్ర—(మంత్రివైపుచూచును)

మంత్రి—ఓరి వేగవంతా!

వేగ—చిత్తము మహాప్రభూ!

కాంతా—నాతండ్రిగారితో నాడుమాటాడుచుండగా నపుడు
నీవుంటివిగదా?

వేగ—అవును

కాంతా—నేనాయనతో నేమంటిని?

వేగ—గుండముత్రవ్వించిన నందుబడిపోయెద నంటిరి

కాంతా—నాథా! దీనికర్థమేమందురు.

విక్ర—ఏమున్నది. గోతఁబడి నశింతుననె

కాంతా—చిత్తము. అట్లనే (వేగవంతునితో) ఇంక నేమంటిని

వేగ—నాకధోమార్గమే శరణంటిరి

కాంతా—దీనికేమి యోచించెదరు!

విక్ర—నరకమే శరణనిభావము

కాంతా—క్రిందిదారికి నధోమార్గమన రాదా?

విక్ర—అదియుగలదు.

కాంతా—(వేగవంతునితో) ఇంక నేమంటిని.

వేగ—నన్నుబోలు నిర్భాగ్యురాల నేలసృజించితి,, వంటిరి

కాంతా—ఇందలిగూఢ మేమని తలంతురు?

విక్ర—విచారసమయమునుచేనట్లు బలికియుండవచ్చును.

కాంతా—కాదుకాదు నారూపునవొక బొమ్మచేయించుమని

విక్ర—(తనలో) ఏమిదీని నెఱజాణతనము

శా॥ శౌరా! ఎంతటిజాణయీలలన తూణీరల్ బన్ని కన్గప్పి దా
గారాగారమువాసిపోయి తుదకుంగార్యంబు సాధించి ప్రి
జ్ఞారాహిత్యుని జేసె నన్నిపుడు రాజ్యంబంత బాలింపనీ
మారాకారుఁడునా కుమారుఁడుదగున్ మాటాడనింకేటికిన్

ఐవనుత్తమకులోత్పన్నుఁడు నిర్మలకీర్తిశాలియై యుండవలయును దీనిమాటలపాటించి నేఁ గ్రహించినచో బ్రజలకు నీఁజారసుఁడగునో కాఁడోయని యనుమానము బాధించుచుండును. కావున దైవసాక్ష్యము కలుగువరకు సంగీకరింపక బిగువు చేసెదను. ఓహృదయమా! పుత్రిగాత్రిపరిష్వంగ సుఖాభిలాషవయ్యు కొంచెమోపికబట్టుము (ప్రకా) ఓసి ఎంతటిమాటలాడితివే? ఎంతటిమాయలాడివే? ఎట్టియుద్యమముబూనితివి పట్టపగలు కనుమూసి గంతగట్టజూచెదవా?

కాంతా — రాజేంద్రా! నాటిరాత్రి మునపడకటింటిలోని సంభాషణమును నేనాడినమాటలగూడ నొకసారి విమర్శింపఁగోరెదను.

విక్ర — ఏది?

కాంతా — ‘సతుల మాత్సర్యంబు,, .. ఇందలిభావము విచారించితిరా

విక్ర — ఓసిచుగాలి! ఇట్టి కల్పితంబులతో బనేమి?

కాంతా — రాజపురంధరా! తాము వేటకై దయచేసినప్పుడొక సుందరాంగుడీసరికదా? అయ్యదియును పరాకుపడితిరా?

విక్ర — (తనలో) దీనికేమని యుత్తరమీయవచ్చును. అడవిలోని సంగతి దీనికెట్లు తెలిసినది. అంతఃపురమందలి వర్తమానములెట్లు గ్రహింపగలిగినది. నిజముగానియ్యది ప్రజ్ఞావంతురాలు, నాతపంబు సార్థకముందినది ఇట్టిశీలవతి రదొకట రాజ్యంబుకన్న నెక్కుడుగదా? (ప్రకా) నాకేమియు దెలియదు.

కాంతా—నాథా! తెలియదందువా? దానికిమీరొసఁగినవో
తావో యీకత్తియు, ముద్దుటుంగరమును గనుఁడు, (అని కత్తియు ము
ద్దుటుంగరము నిచ్చును)

విక్ర—నీవెన్ని చెప్పినను విశ్వసించను. వీని నెవరైన తస్కరించ
వచ్చును, లేదా నేనెక్కడనైన మరచిపోయిన నీకు దొరకవచ్చును.

కాంతా—ప్రాణనాయకా! ఇన్నియు గల్లలేనా? తామున్నను
బంధించిన గృహమందలి సురంగమున జరిగినది చెదరా?

విక్ర—ఇటువంటి దన్యులకు లెవరైన దక్కియుండరాదా?

కాంతా—మహానుభావ! నిద్రించువానిని లేపుట సుకరము
గాని మేల్కొను వానిలేపుట కెటికశక్యము? ఇఁక సమాధానములు మిము
మెప్పింపలేను వల్లభుఁడొల్లకున్న నిదే వారలకెవ్వరుదిక్కను సామెతనా
యందువర్తించినది. ఓ సూర్యచంద్రాది దేవతలారా! మీరందఱు నా
లకింపుఁడు. పంచభూతములారా! తటస్థభావమువిడచి సత్యము పలుకుఁ
డు, నా పాతివ్రత్యమహిమ నిరూపింపుఁడు.

గీ॥ భర్తృపాదములనెపుడు స్వాంతమందు
దలచివర్తింతునేని నాధవుఁడు ధర్మ
శీలుఁడై నన్ను మన్నింపఁజెలఁగుఁదాన
నేనిమత్సతీత్వము నిల్పనెంతుగాత

(తెరలో నాకాశవాణి)

రాజా! ఈమెనీజాయ సందేహమువలదు. ఈకుమారుఁడు నీకు
మారుఁడు. ఈమెపల్కినదంతయు యదార్థము అనుమానము మాను
ము పతివ్రత యనని మెయ్యే,

విక్ర—(సభాసదుల వంకజూచి) వింటిరా! ఆకాశవాణివా
క్కులు. నేనింతతడవు తర్కించకవిడిచినచో నిందలియదార్థము లోక

## షష్ఠాంకము

మునకు దెలియకపోవచ్చును. (కాంతామతినిజూచి) సఖీ! నీపాతివ్రత్య మాకాశవాణి నిర్ణయించినది. నీప్రతిజ్ఞనిల్పుకొంటివి. కుమారా! ఒక్క సారివచ్చినన్ను బిగ్గగాఁగిలించుకొనుము. (అని కుమారునెత్తికొని ముద్దాడి.) బోటీ! నీకార్యము సఫలీకృతమైనది. ఇఁకేమికావలెను.

కాంతా—సర్వమీడేరినది. ఐనను

గీ॥ సతులుపతులతో కలహంబుజల్పి నింద
బొందకుంటయు పతులును ముదముమీర
కాంతలంగని ప్రజనలోన గౌరవంబు
గాంతురిగావుత శ్రీరమా కాంతుదయను

విక్రమార్కుఁడు—తథాస్తు

(అందఱు నిష్క్రమింతురు)

ఇది శ్రీసుందరరామ కరుణాకటాక్ష లబ్ధసరస కవితా
ధురీణ శౌనకసగోత్ర పవిత్ర కృష్ణయార్యపుత్ర
వేంకట రామాఖ్య ప్రణీతంబైన
కాంతామతి అను దృశ్య
ప్రబంధంబునందు
సర్వంబు షష్ఠాంకము
సంపూర్ణము

శ్రీకృష్ణార్పణమస్తు.

——

# పాటలు.

## (శాంతామతి.)

సన్నింక- మారు కేళీ- గూడుమా మనోహరా-

ఆ- పంతమున్- విడ- నాడ- జేయుమా॥ సన్నిం॥

శిరీష- కుసుమ- పేశల- చారు- శరీరా- మధన- శత- సుంద

రా- కారా-

కందర్ప- ధనుష్కర్త- తీవ్ర- బాణా- నంబునను- లో నైతిరా

శత్రుత్వ- మెల- జేచెదో- వి- శాలనేత్ర- ధీవరా॥ సన్ని॥

2 (విక్రమార్కుడు - శాంతామతి)

వి—కలికి- నిను- నే- కలి- సెద- నని-నీ

స్వప్నమందైనను- తలచక- జనుమూ

శాం—పాణివల్లభా- నన్- మోహాబ్ధినిన్- ముంచి యిట్లు

పలుకన్- ధర్మమా- నన్నిట్లు- జేయగ- భావ్యమా

వి—ఓ- మాయాడి- నీ- వికల- బ్రేలకుమా

రయమున- జనుమా- నోరు- మూయుమా

శాం—నాథా- యెంతగా- బ్రతిమి- లాడిన-

దయ-గనవేమీ- మనోహరా

3 (చెరసాలయందు- శాంతామతి- తనలో)

బ్రహ్మ- వ్రాత- దాట- తరమా- తొలుత మహీ-

రాజ్య పాలనము- సలిపిన- త్రిశంకు- పుత్రుడు- అడవుల-

కష్టంబుల- బడలేదా

నళనృపతి- వికృతుడై- ప్రియసిచడవి- వదలి- పిమ్మట- కష్టముల-

బడుచు- జనలేదా

జనాకర్తనె- పృథ్వికి- గలిగినినే- నిర్భయముగ- పధిగను- వగ

దర-మగునే॥

## 4 (చెరయందు కాంతామతి)

న్యాయమా– నన్నిటుల– జేయుట?– నాథా– నా– ప్రాణనాథా
మాయనుగ్రహ– మిప్పటికైన– యీయబలపై రాలేదా? న్యా॥
తోడినారులెల్ల– ప్రియులగూడి– సౌఖ్యములదేలి– యాడు– చుండ
నాపాపమా– విరహాగ్ని– గూల॥ న్యా॥
మూడేండ్ల– నుండి– నన్ను– యీకారా– యందుంచుట మీకు–
శ్రేయమా– నాథా– నాప్రాణనాథా న్యా॥

## 5 (కాంతామతి)

ప్రాణేశా– నాపైనింత– పగయెందుకు మీకు?
నానేపమదియేమి? నాతోడనుడవరాదా? ప్రా॥
నన్నిటుల– నిరాకరించుట– న్యాయమా?
చను నే– కులసతి– నీవిధమనుట ఎన్న కాదయా వచ్చునో– ఎప్పుడు వ
త్తురోయని– జూచుచుండ– నేటితో– సున్నయయ్యె– నాయాశ॥

## 6 (కాంతామతి)

ఈశ్వరా– నాయెడల– నీ– కిట్టినిర్దయ– గల్గెనాపర– మేశ్వరా
శాశ్వతంబగు– ధర్మవేమై ఈశ్వర్యమనినమ్మి–
యుంటినేజగ– దీశ్వరా॥

## 7 (శిక్ష వర్మ)

యింతా– ఘోర– మానటంచు– నే– దలపనైతిగా
ధర్మశీలుడటంచు– నే– నాకొమరిణ నివ్వ

సాకి॥ { కారాగారమందు– కష్టపెట్టు చుండె–
కనికరము లేక కలుషాత్ముండు }

తానొకటి-దలంప–దైవ-మింకొకటి-తలంచునట్లు-సత్యమాయెగా॥యిం

# గుల్మకుఠార్ ఆయిల్.

మందుబుడ్డిని కదిపి పిమ్మట వాడవలెను.

మోతాదు:— { పెద్దవారికి 15 మొదలు 20 చుక్కలు.
పిల్లలకు 5 మొదలు 10 చుక్కలు.

బుడ్డి 1 కి రు 0-6-0 డజను 4-0-0 పోష్టుఖర్చులు ప్రత్యేకం

1 యీమందు కొంచెము కాఫీలో పైనచెప్పిన మోతాదుకలిపి పుచ్చుకొనిన సుఖముగ నాలుగైదు విరోచనములగును. మందుపుచ్చుకొనినవెంటనే మామూలు ప్రకారం కాఫీ పుచ్చుకొనవచ్చును: కాఫీలో కలిపి పుచ్చుకొననివారు పిల్లలు తేనెలోకలిపి రంగరించి పుచ్చుకొనవచ్చును.

2 వాము కషాయములోగాని, శొంఠి కషాయములోగాని పుచ్చుకొనిన మొకలు, అజీర్ణము, కడుపుబ్బరము, నొప్పిపోవును అల్లపురసముతో పుచ్చుకొనిన రొమ్మునొప్పిపోవును లవంగాలకషాయముతోగాని తమలపాకుల రసముతోగాని సేవించిన వగర్పు పోవును.

3 కడుపులో బల్లలు, నీటికంతెలు, కరకాయగాని, ఉసిరికాయగాని, తాడికాయతోగాని కషాయముతీసి సేవించిన నశించును

4 క్రిమివ్యాధులు కురంజీవాము కషాయముతోగాని, కటుకరోహిణీరసముగాని సేవించిన నశించును.

5 ఈయనుపానపు రసములన్నియు, ఒకటే టీస్పూనుకంటె యెక్కువఅవసరములేదు. ఈమందు మిక్కిలి ప్రసిద్ధికెక్కిన రపుతుల బాపనయ్యగారిచే తయారుచేయబడి అనుభవముగ వైద్యముచేయుచున్న వైద్యులచే వాడబడుచు సకలజనులకు మిక్కిలిపని చేయుచుఅనది నము పలుతావులకు పంపబడుచున్నది ఒకసారి చూచిన దీని గుణము మీకే తెలియును.

ఆర్. బాపనయ్య అండు సన్సు
రాజమండ్రి, గోదావరిజిల్లా

# కథలు.

| పుస్తకము | రూ. | అ. |
|---|---|---|
| పన్నెండు రాజులకథలు | 1 | 0 |
| పదునాలు రాజులకథలు | 1 | 0 |
| మధన కామరాజులకథలు | 0 | 10 |
| కాశీమజిలీకథలు 1 భాగం | 1 | 12 |
| డిటో II భాగం | 0 | 12 |
| అరేబియనైట్సుకథలు | 4 | 8 |
| శ్రీధిక్కువిజయము | 0 | 6 |
| శుకసప్తతికథలు | 0 | 8 |
| పురూరవచక్రవర్తికథలు | 0 | 8 |
| అపరూపచంద్రకాంత | 0 | 8 |
| పంచతంత్రము | 0 | 8 |
| నలమహారాజుకథలు | 0 | 6 |
| దమయంతికథలు | 0 | 8 |
| కాళిదాసుకథలు | 1 | 4 |
| వీరేశలింగము చరిత్రము | 1 | 0 |
| శ్రీనాధుని చరిత్రము | 1 | 0 |
| శ్రీకృష్ణభాగవతము ఆదిసభాపర్వములు | 3 | 0 |
| డిటో అరణ్యపర్వము | 3 | 0 |
| కాశీరామేశ్వరయాత్రదర్పనము | 0 | 12 |
| సీతారామ నవల | 1 | 4 |
| రామాయణసారమునచనకావ్యము ముద్దులొలుకు పద్యములు మించిన ప్రతులు దొరకవు | 1 | 4 |
| సాత్యకబ్రహ్మ విరసనము | 1 | 0 |
| సనత్సుక జాతీయము | 0 | 8 |
| సనారివిశ్వేశ్వరసంవాదము | 1 | 12 |
| విజయవిలాసము పద్యకావ్యం | 0 | 8 |
| బిలహనీయము | 0 | 8 |
| పాసందోపాఖ్యానము | 0 | 8 |

# నవలలు

| పుస్తకము | రూ. | అ. |
|---|---|---|
| సౌందర్యతిలక | 1 | 0 |
| కర్పూరమంజరి | 1 | 0 |
| హేమలత | 1 | 0 |
| రాజరత్నము | 0 | 12 |
| రామచంద్రవిజయము | 0 | 12 |
| కృష్ణవేణి | 0 | 8 |
| చమత్కారమంజరి | 0 | 14 |
| డిటో II పార్టు | 0 | 14 |
| ప్రవాసనమంజరి | 0 | 8 |
| అహల్యాబాయి | 0 | 8 |
| సిద్ధార్థ చరిత్రము | 0 | 8 |
| రఘువుల చరిత్ర | 0 | 8 |
| మణిమంజరి | 0 | 8 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| గిసోదము 1, II పార్టులు | 1 | 0 |
| శారద | 1 | 2 |
| శాంతాదేవి | 0 | 12 |
| సతీసోనారాణి | 0 | 12 |
| లలిత | 1 | 0 |
| సువర్ణశృంఖల | 0 | 8 |
| చంద్రవదన | 0 | 8 |
| పరమహంసచరిత్ర | 0 | 12 |
| కపాలకుండల | 0 | 12 |
| పాతలభైరవి | 2 | 0 |
| మాయావి | 1 | 1 |
| మనోరమ | 1 | 1 |
| మాయావిని | 0 | [illegible] |
| మయసభ | 0 | [illegible] |
| విమలాదేవి | 1 | [illegible] |
| తారాబాయి | | |
| శివాజి | | |

వలయువారు

అంబికా బుక్కుడిపో,

# సత్యహరిశ్చంద్రనాటకము

పెక్కునాటక కంపెనీవార్లచే కడురమ్యముగా ప్రదర్శింపబడుచు పేరుగాంచిన నాటకరత్నమిదియే? సాంగ్సు చిత్రపటములుండును

వెల 0—12—0

# సుఖరోగచికిత్సారత్నము

ఇందు సుఖవ్యాధుల గురించి వ్రాయబడినది. మన భారతదేశమందు వ్యభిచారము ఎక్కువైయున్న సంగతి ఎల్లరకు విశదమే? ఆ వ్యభిచారమువల్ల భారతసోదరులు పలువ్యాధులకులోనై సంవత్సరములుకొలది బాధపడుచుండిరి. అట్టిబాధలకు మూడురోజుల నివారణ అయ్యేమందు తయారుచేసి వాడుకొనేలాగున వ్యయప్రయాసలుపడి యీపొత్తము సంపాదించి రెండుభాగములుక్రింద వేయించితిమి. వేశ్యాపిశాచములవద్ద సందపాదించుకొనినజాడ్యములు యీపుస్తకం తెప్పించుకొని వాటిలోప్రకారం మందులుజేసి వాడిన నివారణై హాయిగా వుండెదరు. మొదటిభాగం 0-12-0. రెండవభాగం 0-12-0.

# గజదొంగ

గొప్పదొంగల నాయకుడు జేసినచర్యలు భయంకరములు- గావించినపనులు అద్భుతములు- వేషముల ఒక్కొక్కప్రకరణమందు భయము హాశ్చర్యము- విచారము కలుగుచుండును. వెల 0-12-0

వలయువారు:—

అంబికా బుక్కుడిపో

రాజమండ్రి

